విప్ర—అబ్బ! నీకు నాయభిప్రాయము బోధింప కున్నది. 'ఈమె' యనఁగ నేమి?

శ్రీని—ఇదిగో! దొంగలోళ్ళను బట్టుకొన వేచియుండు నక్కవలె నున్న యీవ్యక్తి—

దేవ—రంగరంగరంగా!

విప్ర—కాదు. ఈమె యనఁగఁ గరచరణాదివిశిష్ట మగు నీ రూపము కాదు. నిరవయవనీరూప మగు నాత్మ. దానికి స్త్రీత్వ మున్నదా?

శ్రీని—చూడకుండ నే నెట్లు చెప్పఁగలుగుదును?

విప్ర.—నేను జెప్పుచుంటిని వినుము. ఈమె స్త్రీ కాదు. నేను బురుషుఁడను గాను.

దేవ—(తనలో) ఈతనికి భక్తితోపాటి ప్రారబ్ధముకూడఁ బట్టిన దేమో?

విప్ర—ఇప్పుడు తెలిసినదా?

శ్రీని—(సందేహముగ) ఉ, ఊఁ.

దేవ—తెలిసె నంటివి గదా? నీవు స్త్రీవా? పురుషుఁడవా?

శ్రీని—రెండును.

విప్ర—అ దెట్లు?

శ్రీని—పురుషులయొద్ద స్త్రీని, స్త్రీలయొద్ద పురుషుఁడను.

విప్ర—సరే, సరే! ఎట్లయిన స్త్రీపురుషభిన్న మైన తత్త్వమవు. (దేవదేవివంకఁ జూచి) ఇదివరకే దేవివారి క్షేమప్రశ్నమున కాలస్య మైనది. క్షమింపవలయును.

దేవ—ఈ శ్రీరంగపట్టణమునకు సమీపమున నున్న యొకచిన్నపల్లె మానివాసము. నేను జన్మమున వేశ్యను. దేవదేవి నా పేరు.

శ్రీని—వేశ్యవే! ఆఁ! ఆఁ! ఏమి స్వామీ! భాగవతులము— బోగము మేళములో నిఁక గలిసిపోవలసినదేనా?

విప్ర—ఏ మనెనో వింటివా? జన్మమున వేశ్య ననినది. వృత్తమునఁ బరమభాగవతోత్తమురాలు.

శ్రీని—పం డ్లూడినతరువాతఁ గాని, వారకాంత భాగవతోత్తమ యగునా ? దేవరవారు పరిశీలింపఁదగును.

దేవ—పండ్లు కనఁబడుచునే యుండఁ బరిశీలన మేందులకు ? దేవా ! అట్టి పరమతుచ్ఛ వేశ్యాకులమునఁ బుట్టి—

విప్ర—రంగరంగరంగా! ఏ పూర్వజన్మపాపముననో యట్లు సంభవించెను.

శ్రీని—(తనలో) అందుచేతనే మన కిప్పు డిట్లు సంభవించెను.

దేవ—పాపమున శాల్యావస్థలోని గండము లన్నిఁటిని దాఁటి బ్రదికి—

విప్ర—పాపము ! రంగ రంగా !

శ్రీని—(తనలో) మనది.

దేవ—మహాపాపమునఁ బెద్దదానవై —

శ్రీని—(తనలో) విటులమహాపుణ్యమున—వైద్యులమహాపుణ్యమున—

దేవ—అంతకంటె నతిఘోర మగు పాపమున నొక్క మర్కటుని కంటఁ గట్టఁబడితిని.

విప్ర—రంగ రంగ రంగా ! వేశ్యలకు స్వచ్ఛందవృత్తి యగునప్పు డొక్కని కని చెప్పితివి. నాకుఁ దెలియలేదు.

శ్రీని—స్వామీ ! ఇది యేమి తులసిమాలలోని పూసలను గణించుటా ! శ్రీరంగదేవార్పణమునకు గ్రుచ్చెడు పుష్పమాలలోని పుష్పములు గణించుటా ! గాయత్రీమంత్రసంఖ్యాగణనమా ! ఊరిలోనివేశ్య కెందరు విటులో లెక్కించుట మన కెందుల కయ్యా ! స్వామీ ! నివృత్తిమార్గమున నుండునరులలో భాగవతోత్తముఁ డెట్లు ప్రప్రథముఁడో ప్రవృత్తిమార్గమునఁ దిరుగువిటులలోఁ గన్నెఁతి కపుఁబెండ్లికొడు కట్లు ప్రప్రథముఁడు. దేవర కిప్పుడు సంశయము వీడినదా ?

విప్ర—ఈమె గుణ మెంత స్వచ్ఛమైనదో నీవు పరిశీలింపకుండ మాటాడు చున్నావు.

శ్రీని—ఆమె గుణమునుగూర్చి నేను జెప్పనేలేదు.

దేవ—అటుపైన—

శ్రని—అటుపైన ననగా - ప్రథమమున పంచమంత్రోపదేశ మైనతరువాత— పద్మసాయక బ్రహ్మజిజ్ఞాసాశాస్త్ర ప్రథమ సూత్రపారాయణ మైనతరువాత—అంతే కాదా!

దేవ—(తనలో) వీఁడు గండ్రముండకొడుకు - యథేష్టప్రవృత్తికి వేశ్యామాత్రవలె నష్టపడుచున్నాఁడు. (ప్రకాశముగ) నాపాప మేమో కాని నామనస్సు ప్రపంచసుఖానురక్తి కెక్కక పోవుటచే—

విప్ర—అది పాపము కాదు. పూర్వజన్మమహాపుణ్యము.

దేవ—ఏమి పుణ్యమో నే నెఱుఁగను. స్వామీ! నేను బడినపాటు లేమి చెప్పుదును! మాఅమ్మ నాకు సింగారింప—నే నగ లూడఁదీసికొన—ఆమె నాకుఁజుక్కబొట్టు పెట్ట—నేను దుడిచికొని తిరుచూర్ణరేఖ తీర్చుకొన—

విప్ర—చూచితివా? పుణ్యురాలియలంకారవైరాగ్యము! ఊర్ధ్వపుండ్రధారణోత్కంఠత! ఆహా! రంగ రంగ రంగా! భక్తి! భక్తి! భక్తి వంటిది మఱియొకటి యున్నదా? వేదవిహితకర్మాచరణ మావశ్యక మంటివే! జ్ఞాన మావశ్యక మంటివే! ఇక్కడ నవి యేవియు నక్కఱలేకుండ నిశ్చలభక్తి చిన్నతనముననే యెట్లు కలిగినదో చూడు! శ్రీరంగమూర్తి నిర్హేతుక జాయమాన కటాక్షవైభవముననే యది కలుగవలయును.

శ్రని—ప్రవృత్తిలోఁ దిరిగి పడకుండ దానిని దుస్సంగశూన్యత్వము చేతనే మనము కాపాడుకొనవలయు నని దేవర యిదివఱకు సాయించినారు.

దేవ—సాయంకాల మగుసరికి, విటాధముల నాకర్షించుటకై, గుమ్మములో నిలువఁబడి తలు పోరఁజేసికొని, రంగుబట్టల పెటపెటలవారు, తాళఁపుగొలుసులగలగలలవారు, కూనిదీర్ఘముల గుయిగుయిలవారగు. నిర్భాగ్యనిరక్షరకుక్షులు వీథినుండి కొంతు కలు సవరించుకొనుచుఁ బోవుచుండ, నిట్టె ముందునకు నట్టె

వెనుకకు దాఁగుకొనుమూఁతి లాడుదమని నన్ను మాయమ్మ గుమ్మములోనికి గెంటి—మొట్టొయని నేను వెనుకవెనుకకు నాలో నేను దిట్టుకొనుచుఁ బోవ—

విప్ర—ఆహా! రంగరంగరంగా! భక్తమణికిఁ బ్రాపంచికసుఖనిర్బంధ మెంత మహాకష్టము! భక్తి యుదయించినపిమ్మట నది నిశ్చలముగ వృద్ధికావలయునుగాని, తుచ్ఛసుఖనిత్య ప్రోత్సాహము దాని కెంత యవరోధము గావించునో చెప్పవలయునా? నీవు నిశ్చల చిత్తవృత్తి గలిగినదాన వగుటచేతనే, నీభక్తి యవ్యాజమైనభక్తి యగుటచేతనే, నీవు సర్వవిఘ్న చరమాశాంతిఁ జేసి, యింత నఱకఁ గడతేఱితివి! నీ యవస్థ విన నాకు జాలి యగుచున్నది.

శ్రీని—(తనలో) మీయవస్థఁ జూడ నా కేడ్పు వచ్చుచున్నది.

దేవ—దీపాలు పెట్టిన నాలుగుగడియలకుఁ బశువులసంతకుఁ బైపల్లె నుంచి వచ్చి పశువుసందర్భము కాకపోవుటచేఁ దిరిగి యింటికిఁ బోవుటకు వీలులేక మాడుచున్న కడుపుమంటను సెనగపప్పు బెల్లముచే శాంతిపఱచుకొని, నిద్రించుటకుఁ దావు దొరుకక, వీథిలో నడయాడుచున్న యేతలమాసినముండకొడుకో యా రాత్రి పెండ్లికొడుకుగ దాపురింప—

శ్రీని—సంతలోఁ బశువు దొరుకుట దుర్లభము గాని సానివీథిలో సాని దొరుక కేమి?

విప్ర—ఎంత కర్మము! రంగరంగరంగా!

దేవ—అట్టి తుచ్ఛరూపస్వభావుఁడు—

శ్రీని—వేశ్యకు వెఱ్ఱిమొగమునిర్భాగ్యులు తప్ప విష్ణుభక్తులు లభింతు రనుకొంటివా యేమి?

దేవ—(తనలో) అమ్మ! నోటిరోఁతపుముండకొడుక! (ప్రకాశముగ) నాచేయి పట్టుకొని గదిలోని కతఁడు లాగ — నేను బంచవల్లీ లోని కాతని నీడ్వ, నన్నాతఁడు బతిమాలుకొనఁగ, నేను మొగము విడిపించుగొని ధుమధుమ లాడ, నన్నాతఁడు బెద

రింప, నేను దిట్ట, నాతఁడు నన్ను దురుక్కులాడ, నే నేడ్వ, నిట్టి ముష్టియుద్ధసంరంభమును మాయమ్మ చూచి నన్నుఁ బడదిట్టి వాఁడు సంతకర్తైన నీ కుండఁ బోవు నేమో యను రోషముతో నన్ను సున్నపుబిడతతో నెత్తిపైఁ గొట్ట—

విప్ర—ఆఁ! ఆఁ! రంగరంగా! సున్నపుఁబిడత యేల?

శ్రీని—బొప్పికి వేఁతే సున్నము రాయ నక్కఱలేకుండుటకు—

దేవ—గిలగిల కొట్టుకొని నే నేడ్వ—(ఏడ్చును.)

విప్ర—రంగరంగరంగా! ఏడువకుము. భక్తునినేత్రములవెంట నానంద బాష్పములు వెడలవలయును.

గీ॥ ఇతరసుఖములఁ గోరక ♦ హీనకష్ట
పాళిఁ బడి భక్తి నిటు వృద్ధి♦పఱచినావు;
కడుపు మండ లోకుల దిట్లఁ ♦ బడుచు నాన
యేమి ధనవృద్ధిఁ జేసెదు ♦ కృపణునట్లు.

దేవ—ఇంటివా రందఱు తల కొకతిట్టుతిట్ట, నిరుగుపొరుగు గుడిసెవేటి పేరటాండ్రు దాడలునొక్కుకొనఁగ,—పిటకాండ్రందఱు వెక వెకలాడ—బోగమింటిపరువు తీసివైచుటకుఁ బుట్టినదీనికి గరిటెఁ గాల్చి వాతవేయుమని వాదపానలు వైద్యబోధములు సేయ—నంకిలి యేమో యని మాయమ్మ సోదికిఁ బోయి, చేటెఁడు ప్రాఁటియాకు తాయెతులు కీలుకీలునకుఁ గట్ట—మంత్రవేత్త లని చెప్పవచ్చిన మోసగాండ్రు నన్ను ముగ్గుల కూర్చుండఁబెట్టి బూడిదతోఁ గలిపిన దూలగొండనూగు నాకుఁ బోసి యేడ్పింప—స్త్రీత్వవృద్ధికై నేరేడుపండ్లంత మాత్రలు నాచే వైద్యులు మ్రింగింప—

శ్రీని—పుంస్త్వవృద్ధికై మదనకామేశ్వరమో మర్దనమో గాని, స్త్రీత్వ వృద్ధికి మం దేల?

విప్ర—రంగరంగా! ఏమి కష్టములు? జనుల కెంత వెఱ్ఱి!

గీ॥ అనృతవాదులు సత్యవాక్యుఁ డని బుద్ధి
హీనుఁ డని యతిభయుఁ డని యెన్నుచుంద్రు
కులటలు పతివ్రతను వెఱ్ఱిగోల యొంట
రెత్తు చచ్చుపెద్దమ్మని యీసడింత్రు.

గీ॥ అత్యనాచారు లిద్దని స్వాధికాత్ము
ఛాందసపుముండకొడుకని చాటుచుంద్రు
భవరుజాపీడితులు భక్తవరుని బిత్త
విభ్రమాదభ్రుఁ డని బాధఁ బెట్టుచుంద్రు.

గీ॥ తమకుఁ గలవెఱ్ఱి దాఁటిన ధన్యతముని
వెఱ్ఱివానిగ జనులు భావించుచుంద
రట్టివెఱ్ఱి దీఱినవెఱ్ఱి యతఁడు లోకు
లెల్లరును వెఱ్ఱివారని యెంచవలయు.

విప్ర—దేవివారు సాయించు నుపన్యాసమునకు నడ్డు వచ్చితిని. క్షమించి
సెలవిచ్చెదరుగాక !

శ్రీని—దేవివారి యుపన్యాసమునకు దేవరవారి యోపికకుఁ గూడ
నంతము గానఁబడకున్నది !

విప్ర—శ్రీనివాసా ! అట్టులాడుట న్యాయమా ?

గీ॥ భక్తవృద్ధికై భక్తుఁడు పడెడు పాట్లు
భక్తుఁడు గ్రహింపఁదగుఁగాక పరునితరమె ?
ఘనమహాకావ్యపోషణమునఁ గవి పడు
కష్ట మితరుఁ డెఱుంగునే కవియె కాక.

శ్రీని—గప్పు మని యొకసారి మెఱుపు మెఱసినట్లు—పూలు జల్లున
నాకస్మికముగఁ జల్లినట్లు—చల్లగా హఠాత్తుగాఁ బన్నీరు చిలికి
నట్లు—చందనగంధగంధిలమందమారుత మట్టె వీచినట్లు—సరస
సంగీతమాధురీధురీణారావపువిసరు చెవిని బడి హృదయమున
దూరినట్లు— సుందరయువతీగురుకుచాగ్రయాదృచ్ఛికస్పర్శచే
నొడలు మనస్సు నాత్మయంతయు నొకమాఱు జలజల మని

నట్లు—ఈ యంశముమాత్ర మడిగేయేనికి దేవరవారి కిప్పటివఱ కననుభూతము. క్షమింపవలయును—నిష్ప్రయత్నముగ, నిరాయాసముగ, నబుద్ధిపూర్వకముగ బయలువెడలినకవిత యానందింపఁజేయునుగాని, గాడెక్రింది పందికొక్కువలె రేయింబగళ్ళు బఱికి బఱికి, పండ్లు గిట్టకఱచుకొనఁజేయునట్లు అంపఁపుకోఁత వలెఁ గోసి కోసి, గ్రుడ్లు నీరుగ్రమ్మ నొక్కొక్కవెంట్రుకను దంటసమునవలెఁ బీఁకి పీఁకి, జనపనారపచ్చడినివలె వెనుకకు ముందునకు నూఱి నూఱినట్టు, కష్టపూర్వకముగ, బలాత్కారముగలాగి లాగి, యీడ్చి యీడ్చి చెప్పి వీథిని బారవైచిన కవిత, వెఱ్ఱికుక్కవలెఁ దోఁకముడిచి, పండ్లిగిలించి, తోఁచక, తావులేక, యందఱిని జూచి తా జడియుచు, నందఱికిఁ దా భయహేయతలను గలిగించుచు, నొకచోట నైన నొక నిముసమైన స్థిమితముగ నిలువఁబడదు నన్న 'ఛీఛీ' యను ధ్వనులచే బెదరి పాఱిపోవుచు, లోకులు నిందించుచున్నా రని యేడ్చుచు, నందులకొఱకు లోకులపైఁ బగఁ దీర్చుకొనఁ గఱువఁ బోవును, నొకనిని జంపుచుఁ దాను మూరఁపువారి ఱాలదెబ్బలను దగ్గరవారికఱ్ఱదెబ్బలను దిని పరమపదించును. భక్తియుఁగూడ నటులే. అది దివ్యతేజమువలె బయలువెడలవలయును. అట్టి యదృష్ట పూర్వపుణ్యమునఁ బ్రాఁకవలయును. అంతయే కాని పడగానిపాటులఁ బడినంతమాత్రమున నది వృద్ధియగునా? గొప్పద్రవ్వుట కది యేమి వంగచెట్టా? గసికఁ గొట్టినఁ గాని పక్వము గాకుండుట కది యేమి పనసకాయయా? దంపి, సాగఁ దీసి, లట్టించినఁ గాని భోగ్యము గా కుండుట కదియేమి గోధుమ పిండియా? మహాకష్టములఁ బడి యెట్టులో స్వల్పముగ వృద్ధి చేసికొనుభక్తి నిశ్చలముగమాత్రము నిలువదు. ఏటుక్కలాడి, వగలాడి, తగులమారి పేరఁటాలో కుక్క దధ్యోదనపుఁబాత్రను వలె నోటఁ గఱచుకొని పోవును.

విప్ర—రంగరంగరంగా! రంగ!

దేవ—మహాత్మా! దేవరశిష్యుఁడు సూర్యునికి వారములును, చంద్రునికిఁ దిథులును జెప్పువాఁడుగ నున్నాఁడు!

శ్రీని—ఈక్రొత్తశిష్యురాలు—ఈ క్రొత్తశిష్యురాలు— గోవింద భక్తునకుఁ గొక్కోకము సెప్పుటకు వచ్చినది కాఁబోలు నేమి?

దేవ—(తనలో) వీఁ డసాధ్యుఁడే!

విప్ర—(చెవులు మూసికొని) రంగరంగరంగా! అట్లనెద వేమి?

శ్రీని—నేను దేవర నేమియు ననలేదు. ఈ శిష్యురాలు నన్నధిక్షేపింపనేల?

విప్ర—కాని, నీబుద్ధి మొదటినుండియుఁ గనిపెట్టుచుంటిని. ఏమో లోకవిరుద్ధముగ నున్నది.

శ్రీని—మీ చర్యయో? ఈవయసేమి? ఇంత భక్తి యేమి? ఈ దేహదార్ఢ్య మేమి? ఈ ప్రపత్తి యేమి? ఈ రక్తపటిమ యేమి? ఈ యింద్రియనిగ్రహ మేమి? ఈ ప్రాపంచికసౌఖ్యవిరాగత యేమి! ఈ వానప్రస్థత యేమి? ఈ మాధుకరభిక్షాన్ననియమ మేమి! ఈ చర్య లోకవిరుద్ధముగాదా? మీశిష్యుఁడ నైన నా బుద్ధికూడ నట్లే యుండుట యాశ్చర్యమా!

విప్ర—(నవ్వుచుఁ దల పంకించి) నీవు స్తుతిని మానవుకదా!

శ్రీని—స్తుతిని మాను మని నన్ను దిద్దుటకంటె సత్యమును జెప్పవలయు నని శాసించువేదమును దిద్దిన బాగుగ నుండును.

దేవ—(తనలో) ఆహా! మహాత్ముఁడు బహునిష్కల్మషహృదయుఁడు. బహుభూతదయాయుక్తుఁడు. స్త్రీపురుషభేదమే యిప్పటి కెఱుఁగనిమహామహుఁడు. కాని స్వల్పస్తుతిప్రియత, అత్యమాయికత మొదలగు కొన్ని లోపము లీయనయం దుంటచేతనే యాసపడుచుంటిని గాని, జాగిలమువలె నీతని గాచియున్న యీశిష్యుని దలఁచుకొన భయము వైచుచున్నది.

విప్ర—భాగవతోత్తమురాలా! కానిండు.

దేవ—ఏ మున్నది? భక్తురాల వని, బ్రహ్మచారిణి వని, వైరాగిని వని జోగిని వని—యందఱు నన్నుఁ దరిమితరిమి తిట్టితిట్టి— బాధింప—

విప్ర—ఆఁ! ఆఁ! నిజమే! నిజమే!

గీ॥ అట్టిశుభనామములు తుచ్ఛులందుఁ జేరి
తిట్టు లయి భక్తునకు నిందఁ ♦ దెచ్చు నింత
కవిమృదులవాక్యములు నిర♦క్షరనటకుల
నోటఁ బడి కవి కిసుమంతె ♦ మాఁబవలెను.

కాని,

గీ॥ సంగయుతులకు భూష లౌ ♦ స్వర్ణకాంత,
లగును దూష్యము లధికభ♦క్త్యంచితునకు;
వారి కలిదూష్యహేయ మగా ♦ భక్తిమార్గ,
మగును బరమభూషణము భ♦క్తాధికులకు.

దేవ—ఇంటిలోనే పడి "భగవంతుఁడా! నీ పాదసాన్నిధ్యమున కెప్పుడు తీసికొనిపోవుదువోయీ!" యని యేడ్చుచు నొకపంచను పైఁటచెఱఁగుఁ బఱచుకొని రంగనామస్మరణము సేయుచుఁ బడియుండ నొక్కరేయి భుజాగ్రపరిచిహ్నితశంఖచక్రుఁడు—తులసీమాలావక్షస్కుఁడు — ద్వాదశోర్ధ్వపుండ్రవిభూషిత దేహుఁ డగు నల్లని యాచార్యపురుషుఁ డొకఁడు స్వప్నమున సాక్షాత్కృతుఁ డయ్యెను.

శ్రీని—వేశ్యయింటికి స్వప్నములోనైన నాచార్యపురుషుఁడు వేంచేయుట కిదియే మొదటిసారి!

విప్ర—ఆహా! ఆహా! ఏమి నీయదృష్టము! తరువాత నేమి జరిగినదో చెప్పు.

దేవ—నే నామహాత్మునకు నమస్కరించి దేవరవా రెవరో సెలవిం డని వేఁడుకొంటిని.

విప్ర—కానీ ! త్వరగఁ జెప్పుము.

శ్రీని—ఉండుఁడు. ఏమి చెప్పవలయునో యాలోచించుకొననీయ రేమి ?

దేవ—ఆలోచించుకొనుట కిది యసత్య మని నీయభిప్రాయమా ?

శ్రీని—నిన్నరాత్రి గలిగిన స్వప్న మీయుదయముననే యెంతయో నిదానించి స్మృతికిఁ దెచ్చుకొనినఁగాని పూర్తిగా వెల్లడింప లేము. అట్టిచో నెప్పుడో గలిగిన స్వప్నము నాలోచించుకొన కుండ నెట్లు చెప్పఁగల్గుదు వని యంటిని. లేనిపోని దురభిప్రాయ మేల పడెదవు ?

విప్ర—నాయనా ! ఉండవోయి ! శీఘ్రముగ నేమి జరిగినదో చెప్పుము. తా నెవరి నని చెప్పెను ?

దేవ—నన్ను విష్ణుదాసుఁ డంటి రనెను.

శ్రీని—అ దేమి మాట ? వైష్ణవులు విష్ణుదాసులుగాక వేశ్యాదాసు లగు దురా !

విప్ర— ఆతని పేరు ?

దేవ—పేరు చెప్ప వీలులేదు. నేను శ్రీన్నవణ్ణంశైద పెరుమాళ్ దా సుఁడ ననెను.

విప్ర—ఓహో ! భక్తసారులవా రోయి ! భార్గవాన్వయులోయి ! నాక ణ్ణన్ వలె నిద్దఱుతల్లులపుత్త్రులోయి !

శ్రీని—ముసలిదానికిఁ బడుచుఁదన మిచ్చిన మహాపురుషులా ?

విప్ర—ఔను !

శ్రీని—(అపవారించి) ఈ పడుచుముండ నాతఁడు ముసలిదానిని జేసిన యెడల మన కీ బాధ యుండక పోవును. (ప్రకాశముగ) అయ్యో ! పార్వతీపరమేశ్వరు లెదుట నిలిచిననైన వారిం జూడని మహాత్ముఁ డీమెయింటికి వచ్చె ననిన నెట్లు నమ్మెదరు ?

విప్ర—నారాయణమూర్తియే యాశ్రిత పరమ సులభుఁడై యుండఁ దద్భక్తులుగూడ నట్లుండరా ? తరువాత నేమి జరిగెను ?

దేవ—మహాత్మా! నా కేమైనఁ దారకమార్గ మున్న దేమో చెప్పుమని ప్రార్థించితిని.

శ్రీని—(తనలో) తారకమార్గము నిప్పు డేల వెదకుకొనవలయును? వృద్ధు ననుసరించి యూరిహారి నెత్తిఁగొట్టుటయే తారకమార్గము!

విప్ర—తరువాత—

దేవ—"శ్రీరంగక్షేత్రమునఁ బుష్పవనమున నర్థపంచకజ్ఞానసంపన్నుఁడగు మహాత్ముఁ డొకఁడు విప్రనారాయణుఁ డనుపేరున వెలయుచున్నాఁడు. నీవు పోయి యాతని సేవించిన నిస్సంశయముగఁ గృతార్థురాల వగుదువు" అనెను.

శ్రీని—(తనలో) ఈ దుర్వేశ్యాసంగతి కాచార్యోపదేశము మూలాధార మయ్యెనా?

విప్ర—ఆఁ! ఆఁ! నే నంతవాఁడనా? అయ్యయో! దురాత్ముఁడను. పాపిష్ఠుఁడను. ఆ మహాత్ముని పాదుకల కున్నంత యర్హత యైన నాకు లేదే!

శ్రీని—ఆ పాదుకలక్రిందిమట్టి కున్నంత యర్హత నాకు లేదు.

దేవ—ఇట్లు సాయించి యాతఁ డంతర్హితుఁ డయ్యెను. ఒక్కతెను బైకి రాఁగ నూరివారు జాలఁ గొట్టుదు రని భయముచే మాయక్కను సహాయురాలిగఁ దీసికొని నిన్నఁటియుదయమున నీ పుష్పవనముఁ జేరి దేవరయెదుటఁబడి మాయక్కతో సాష్టాంగపడితిని.

విప్ర—ఆఁ! ఆఁ! అ దెప్పుడు?

శ్రీని—నిన్నఁటియుదయమున నని చెప్పియే యున్నది!

విప్ర—నీవుకూడ నప్పుడు నాతోడనే యుంటివి కాదా?

శ్రీని—ఊఁ!

దేవ—మీశిష్యుఁడు మమ్ములఁ జూచినట్లు నే ననుకొంటిని.

విప్ర—శ్రీనివాసా! చూచితివా?

శ్రీని—చూచితిని.

విప్రు—అప్పు డేల చెప్పలేదు?

శ్రీని—దేవరవారియొద్ద విష్ణుగాథామాహాత్మ్యమును నేర్చుకొన వచ్చిన వాఁడను గాని, దేవరకు వేశ్యాగాథాకలాపమును బోధించుటకై వచ్చియుండకపోవుటచేత—

విప్రు—ఇఁక నెక్కడి వేశ్య యోయి! ఆ వేశ్యాజన్మమే పోయినది! తత్సంస్కారములే నశించినవి! ఇది యొక పరిశుద్ధతత్త్వము.

దేవ—సాష్టాంగపడినను దేవరవా రాశీర్వదింప కుండుటచేతను— మావంకఁజూడనైనఁ జూడకపోవుటచేతను—

విప్రు—క్షమించవలయును.

దేవ—దేవరమనము శ్రీరంగేశ్వరపుష్పమాలాకైంకర్యసంకలితమై యుండుటచే దేవర కన్యవస్తువు కనఁబడునా? నన్నుఁ జూడని భక్తాగ్రగణ్యులు నాసేవ నంగీకరించి నన్నుఁ గృతార్థను జేయ రని మహావిచార మొంది, మతిలేక, యెచ్చటికిఁ బోవుటకును గతియు దిక్కును లేక, యేమిచేయుటకుఁ దోఁచక, శ్రీరంగక్షేత్రమంతయుఁ దిరిగి తిరిగి, పరమార్తిచే నేడ్చి యేడ్చి, నిన్న రాత్రి రెండుయామములకుఁ గావేరిలోఁ దిగి ప్రాణత్యాగమును జేయుటకై తటీరమును జేరితిని.

విప్రు—రంగ రంగ రంగా! ఎంతమాట వింటిని!

శ్రీని—(తనలో) ఏదీ! జరిగినది కాదు.

విప్రు—కరచరణాద్యవయవవిశిష్ట మగు నిట్టి రూపమున నుంటచేతనే యాత్మకు మోక్షోపాయము కలిగినది. ఆత్మ తరించునది దేహముచేతనే. రంగరంగా యని స్మరించుటకు నో రుంటచేతనే, రంగా యనుటకు పలుకు, దరుగులిడుటకుఁ గాళ్లు లుండుటచేతనే, రంగని దర్శించుటకుఁ గన్ను లుంటచేతనే, రంగని బూలఁ బూజసేయుటకుఁ జేతు లుంటచేతనే కదా—మన యాత్మలకు రంగభక్తి

కుదిరినది ? అవయవరహితమును రూపశూన్యమైన యాత్మ రంగని సేవించు టెట్లు ? సేవించిన నది యొకసంతుష్టికర మగు సేవగ నుండునా ? గట్టిగ వదలకుండ రంగనికాళులు పట్టుకొన వలయును. నోరార్చుకొనిపోవునట్లు రంగనామము స్మరింప వలయును. అది సంపూర్ణ మగు సేవ. అది సంతుష్టికర మగు కైంకర్యము.

శ్రీని——(తనలో) దీనికే జబర్దస్తీభక్తి యని పేరు.

విప్ర——నామనసులోని యభిప్రాయమును నీకుఁ జెప్పెదను వినుము. నాకు మోక్షమం దైన నంత యపేక్ష లేదు. ఎన్నిజన్మము లయినను దనివి దీఱకుండ నొక్కరీతిగ రంగకైంకర్యమును జేయుటయే నాకుఁ గావలసినఫలము. సరి, సరి ! దీని కేమి ? తరువాత నేమి జరిగెను?

దేవ——అప్పుడంత జనసమ్మర్దముగా నుండుటచేఁ గొంతసేపు తాళి యుండవలయు నని తత్తరమునఁ గూరుచుండ నెందుచేతనో కన్నుల కట్టె మబ్బు దగుల సొమ్మసిల్లితిని.

శ్రీని——(తనలో) తాగుటచేత——

విప్ర——సెబాస్ ! రంగఁడు నీప్రయత్నమును గొనసాగనిచ్చెనా ?

శ్రీని——(తనలో) ఎవనిగొంతుఁ గోయుట కట్టెపెట్టియుంచెనో?

దేవ——అంతట నిద్రావస్థలో——

శ్రీని——తిరిగి స్వప్నమా? ఇదివఱ కాచార్యపురుషునివంతు తీరెనది. ఇఁక రంగనిదికాఁబోలు! వేశ్యానునయమునకు భగవంతుఁడు, భాగవతోత్తము లెంత చవుక యయిపోయినారు!

విప్ర——అదియే భగవంతునియం దున్న విశేషము. ఆశ్రితాతిసుల భుఁడు. గజేంద్రాళ్వారులు తిరుప్రపత్తి సేయ, నిత్యసూరు లాశ్చర్యపడునట్లు స్వామి పరమపదమునుండి వేంచేసి మకరికా దంతప్రణబాధిత మగు భక్తసిపాదమును శ్రీదేవీకపోలఫలక

లాలనశీల మగు తనదక్షిణహస్తమున నొత్తి ధన్యాత్ముని జేసిన యాభక్తవత్సలునికంటె — ఆ పరమపురుషునికంటె — ఆ చక్రవర్తితిరుమగనారుకంటె — ఆ జగదాధారునికంటె — నాకన్నను కంటె సులభుం డెవండు? ఆపదల కష్టపడువాం డెవండు? రక్షించువాం డెవండు? అజ్ఞానహరుం డెవ్వండు? నిత్యానంద ప్రదాత యెవ్వండు? రంగరంగరంగా! (ఏడుచును.)

దేవ—ఎవరో వచ్చి నన్ను శ్రీరంగేశ్వరుని యాలయములోనికిం దీసికొనిపోయినారు. "రంగరంగా! విప్రనారాయణమూర్తిని సేవింప వచ్చి యాతనిచేం దిరస్కరింపంబడి నీ పాదములే గతి యని నమ్మి వచ్చితి" నని పెద్దకేకలు పెట్టి యేడ్చితిని.

శ్రీని—ఇదివఱ కెవరో వచ్చి తీసికొనిపోయి రని చెప్పియుండి యిప్పుడు నీయంత నీవే యాలయమునకు వెళ్లినట్లు చెప్పుచున్నావు !

విప్ర—అది యొకతప్పు కాదు. కానిమ్ము.

దేవ—"తెల్లవారిన పిమ్మట మాలాకైంకర్యమునకై వచ్చు విప్రనారాయణుని మేము మందలింతుము. నీవు పోయి యాతనినే సేవింపుము" అని స్వామి గంభీరవాక్యములం బ్రసాదించిన ట్లుండ నదరిపడి మేల్కాంచితిని.

విప్ర—రంగరంగరంగా ! అయ్యయ్యో ! రంగరంగరంగా ! ఇంక నే మున్నది? రంగరంగరంగా! ఇందులకా మోము ముడుచుకొంటివి! ఇందులకా యప్రసన్నముఖుండవై యుంటివి! ఇదిగో! లెంపలు వైచుకొనుచున్నాను. (అట్లు చేయును.) రంగరంగరంగా! క్షమింపుము. సర్వాపరాధిని క్షమింపుము. భక్తశిఖామణీ ! నన్ను మందలింతు నని స్వామి సెల విచ్చెను గాదా! సెలవిచ్చెనుగాదా! సెలవిచ్చెనుగాదా!

దేవ—ఏమి అట్లు సంభ్రమపడెద రేమి? నావలన నేమైనం దప్పు గలిగెనా?

విప్ర—నీవలనఁ గాదు; ఈ నిర్భాగ్యునివలన— ఈ యకిశోన్మని వలన—ఈ మత్తుని వలన—ఈ మందుని వలన— ఈ దురహంకారునివలన—

శ్రీని—అట్లు దూషించుకొందు రేల? శ్రీరంగదర్శనతత్పరతను మీ నేత్రము లుండి, శ్రీరంగదేవాలయఘంటాంకారనాదశ్రవణతత్పరతను మీ కర్ణము లుండి, పాశురపఠనావేగమున మీజిహ్వ యుండి, భక్త్యావేశమున నాత్మ యుండి, దేహస్మృతియే లేనట్లు లుండిన మీ రీతెను గాంచి, యానందించి, యాశీర్వదించి, ప్రసంగించి, యుపదేశించి, కృతార్థు నా నిముసమునసే చేయలేదని శ్రీరంగమూర్తికి మీపైఁ గోపము వచ్చిన దనుకొనుట కంటె ననందర్భమైనవాక్యము సృష్ట్యాది యిప్పటివఱకుఁ గలిగి యుండ దని నా యభిప్రాయము. అందులో శ్రీరంగమూర్తియే యట్లు సాయించుట తనదైవత్వమును దాను దగ్ధముచేసికొనుట గాని మఱి యొకటియా!

విప్ర—రంగరంగరంగా! ఎట్టిమాట లాడుచున్నావు? శ్రీనివాసా! నీకుఁ దెలియదు. విష్ణుతిరస్కారముకంటె విష్ణుభక్తతిరస్కారము మహాపాపప్రద మోయి! అట్టిమహాపాపము నా మెడకుఁ జుట్టుకొనినది. రంగరంగా! రంగా! ఎట్లు లుద్ధరింతువో! ప్రపన్నురాలా! నన్ను మందలింతు నని స్వామి యానతిచ్చెను గాదా? ఆనతిచ్చెను గాదా? ఆనతిచ్చెను గాదా!

దేవ—మహాత్మా! నేను శాంతి నొంద దేవరయొద్దకు వచ్చి తమకుఁ దొందర యిచ్చుచుంటినా? నే నేమైనఁ దప్పాడితినా?

విప్ర—నీ వాడినవి వేదాక్షరములు! నీవు మహాత్మురాలవు. దైవసాక్షాత్కారము గలదానవు. నీతో భగవంతుఁడు సెలవిచ్చి న్నట్లు నన్ని యుదయమున నాతఁడు మందలించినాఁడు.

దేవ—ఎట్లు! ఎట్లు?

శ్రీని—(తనలో) ఇదివరకు విననట్లే! ఎఱుఁగనట్లే! నిన్నయుదయము నుండియు నీముండ మమ్ము తథాస్తుదేవతవలెఁ గనఁబడకుండ సమీపమున నాశ్రయించుకొని తిరుగుచునే యున్న దేమో?

విప్ర—నా కాతఁడీయుదయమునఁ బ్రసన్నుఁడు కానేలేదు. ఆతని మొగము వికాసవంతముగనే లేదు. మందహాసపూర్ణముగ నుండుటకు మాఱుగ ధుమధుమ లాడుచున్నది. నా కింతకంటె నే మున్నది? నాబ్రదుకున కింతకంటె లోప మేమి? నాదుఃఖమున కింతకంటె నవధి యేమి? నానేత్రముల కింతకంటె మంట యేమి? నామహాపాపమున కింతకంటె దుష్టఫల మేమి? నాయాత్మ కింతకంటె శల్య మేమి? మందలింతు నని యాజ్ఞ యిచ్చెను. మందలించినాఁడు. నిన్ను నాయొద్దకుఁ జేర్చుకొంటిని. ఇఁక నామహాత్ముఁడు నాకుఁ బ్రసన్నుఁడు గాకుండునా! అతిసులభుఁడే! ఆశ్రితదోషభోగ్యత్వగుణసంపన్నుఁడే! అమిత కరుణాపరిపూర్ణుఁడే! అట్టి శ్రీరంగమూర్తి నా కింకఁ బ్రసన్నుఁడు గాకుండునా? అగును. నాత ప్పేదియో తెలిసినది. అందులకా శిక్షయైనది. నామనస్సు నిర్విచారమైనది. రంగరంగ రంగా! రక్షించితివి! ఇదిగో నీవు నాయొద్దకుఁ బంపిన భక్తురాలు. ఈమెతో మహానందమున నింకఁ గాలక్షేపమును జేసెదను. ఓరంగదాసురాలా! నీమూలమున నేఁ గృతార్థుఁడ నైతిని.

దేవ—దేవరవారిపాదమూల మాశ్రయించి సఫలమనోరథను గావచ్చిన నాతో మీ రిట్టు లానతీయఁ దగునా? దేవరకు శిష్యురాలను, సేవకురాలను. మీపాదముల నొత్తుదును. మీవస్త్రముల నుదుకుదును. మీపూలమొక్కలకు నీళ్ళు తోడుదును. మీరు రంగని కర్పించుపూలదండలను నేను గ్రుత్తును.

విప్ర—అది నే నంగీకరింపను. నా కీ చేతు లేల? రంగఁడు ధరింపఁదగిన పూలమాలలు నేనే గ్రుచ్చనియెడల నాచేతు లేల కాల్పనా! మాలాకారు లగు భక్తు లెందఱో తరించి రని విని నే నిట్టి దాస్యముచే నాతనువును బవిత్రముగఁ జేసికొనుచున్నాను.

దేవ—అట్లుయైన పోనిండు. నేను మీపర్ణశాలను సమ్మార్జనము చేసెదను, అలికెదను, ముగ్గు పెట్టెదను—

శ్రీని—ఒకటి యనినమాట యేమి? ఆండువారు చేయు నన్నిపనులను జేయ నిశ్చయించుకొనినావు!

విప్ర—శ్రీనివాసా! నీకుం గొంత దేహశ్రమము తగ్గు నని సంతోషపడుచున్నావా?

శ్రీని—దేహశ్రమమున కేమి కాని హృదయశ్రమము ద్విగుణమైనది.

విప్ర—ఎందుచేత?

శ్రీని—భక్తి రాజు చిక్కుడుతీంగవలె నొంటరిగనే యెదుగందగినది. అడియేను వచ్చినపిదపనే దేవరభక్తిసాంగత్యమున కేమి లోపము గలిగెనో యని నేను విచారించుచుంటిని. అందుపై వన్నెలు చిన్నెలు గల యీమె యొకతె దాపరించినది. సర్వసంగపరిత్యాగు లగు దేవరకు సంసారవృద్ధి యగుచున్నది. ఇంకె నెంత వృద్ధి యగునో యని నే నేడ్చుచున్నాను.

విప్ర—సంసారవృద్ధి యెట్లగును? సున్న లెన్ని గూడిన నొకటి యగునా? ఈమె రంగనియాజ్ఞపై నిట్లు వేంచేసినది మన యిష్ట మేమున్నది?

దేవ—దేవా! మీ కిష్టము లేనియెడల నే నెచ్చటికైనం బోవుదును. నిర్బంధ మేల?

విప్ర—రంగరంగరంగా! ఎంత మాట నాడితివి! నీవు మహాభక్తురాలవు. నీ సాంగత్యమునకంటె నాకుం గావలసిన దేమి? అందుపైం బరమ ప్రపన్నశేఖరు లగు భక్తిసారభగవానునిచే నిటకుం బంపబడితివి.

దేవ—దేవరదాసినై నే నిచ్చట నుండుట మీ కిష్టమేకదా!

విప్ర—అడియేని కది మహాభాగ్యము.

శ్రీని—(తనలో) రంగరంగరంగా!

దేవ——మీ భక్తశేష మేమైన నున్న నది మీ శిష్యునిచేఁ గుక్కకు విదిర్చినట్లు వేయించుచేడు. ఈ బొందిలోఁ బ్రాణము లున్నంతవఱకు శ్రీరంగదేవ కైంకర్యము, దేవర కైంకర్యము చేసికొనుచు నుండెదను.

విప్ర——రంగరంగరంగా! అట్లు లాడఁ దగునా?

శ్రీని——అట్లు లాడుట తగదు కావున, దేవర యారగించు భిక్షాన్న మీ మీ చేతనే మాధుకర మెత్తించి తెప్పించఁ దగును.

విప్ర——అ దెందులకు? నేనే పోయెదను. లేనియెడల నీవు పోయి తేవచ్చును.

శ్రీని——దేవరకు వర్ణవిభాగముఁ బని లేదు; లింగభేదముతో నంత కంటెఁ బనిలేనప్పు డామె తెచ్చిన బాధ యే మున్నది?

విప్ర——ఎందులకోయి! అట్టి యగత్యము లేదు.

శ్రీని——(తనలో)

సీ॥ విప్రాంత్యజులలోన ♦ భేద మే మనఁగాని
పంచముతోడ సాఁపడఁగలేఁడు
తరుణీపురుషు లొక్క ♦ తత్త్వ మా ననఁగాని
యింతి పీఁటఁబడ సహింపలేఁడు
వేదముల్ చలిమంట ♦ వేయ నో ననఁగాని
తండ్రిశ్రాద్ధము సమంత్రముగఁ జేయు
సత్యవర్తనమే ప్రశస్త మా ననఁ గాని
పలికిన ట్లాచరింపంగ లేఁడు
తనకుడియెడమచేతులఁ ♦ దనరునట్టి
భేదమే తీర్చుకోలేని ♦ వెఱ్ఱినరుఁడు
లింగవర్ణభేదములు మాన్పంగఁగలఁడె?
పోల్కికేశల సృష్టినిర్మూల మగునె?

గీ॥ బ్రహ్మసృష్టిలో భేదమే ♦ ప్రాతిపదిక
వర్ణభేదదులు మఱొక ♦ ప్రబలభేద
మెంచి యొకనిపై నొకఁ డేచి ♦ యెగయుచుండ్రు
భేదశూన్యముగ బ్రదుకె ♦ లేదుగాదె!

సీ॥ కుక్కగొడుగులవలెఁ బుట్టి • గ్రుంకు మనము
ప్రాక్తనప్రకృతిగతిప్ర•వాహ మడ్డు
పఱుతుమే ? బుద్బుదము లట్లు • పైని నూఁగి
యెటనొ టప్పనకుండఁ బే•లుటయె కాక !

(ప్రకాశముగ) స్వామీ! అట్లేమో యనిమిత్తముగ నున్నారేమి?

విప్ర—నా కిపుడు మనసు నిర్మలముగ నున్నది. లోపలినుండి యేదియో సముద్రతరంగములవలెఁ బొంగుచున్నట్లున్నది. ఒడలు జలజల లాడుచున్నది. పులకాంకుర మగుచున్నది. రంగరంగ రంగా ! ప్రసన్నుఁడవైతివి. మీరందఱు నాతోఁ బాడుఁడు. నాతోఁ దాండవింపుఁడు. రంగరంగరంగా ! రంగరంగరంగా !

దేవ—(తనలో) భక్త్యావేశ మాహెంకజ్వరమువలె దినమున కొకసారియో రెండుసారులో తగిలి విడుచునుగాఁబోలు !

కాంభోజిరాగము—ఆదితాళము.

విప్ర—నీరదలలితాంగ శ్రీరంగా ! • నిఖిలపాపవిభంగ ॥నీ॥
సారహీనం బైన యీసం•సారమందునఁ జిక్కి నీ పద
నీరజంబుల భక్తిఁ గొల్వఁగ•నేరక చెడిపోతి రంగా ! ॥నీ॥

దేవ—(తనలో) ఇఁక ముం దది జరుగవలయును.

విప్ర—సుందరం బగు ఫాలతలమందు • శోభిల్లెడుచిఱుకురు
లందముగ నిరుపాయ లందగను
చెందొవ న్నిందింపఁగం దగు • చందమున దిరురేఖఁ దీర్చిన
చందమామనుబోలు నీమొగ • మెందులకుఁజూపింపకుందువు ॥నీ॥

దేవ—(తనలో) ఈ మొగము నామొగమా ? రంగనిమొగమా ?

విప్ర—(గట్టిగ తాండవించి) రంగరంగరంగా ! రంగా !
(పెద్దకేకలు వైచి నేలఁబడును.)

దేవ—ఆహా ! ఆహా! భక్త్యధికతచేఁ గాఁబోలు! మహాత్ముఁడు మూర్ఛనొందినాఁడు.

దేవ—(ఆతని దగ్గఱకువచ్చి నిలుచుకొని పైటచెఱఁగుతో విసరుచుఁ దనలో) ఇట్టియవస్థనే నేను గోరితిని. స్త్రీస్పర్శచే నేమైనమార్పు కలుగునేమో? (తలయుఁ జెక్కులు వక్షమును నిమురుచున్నది.)

శ్రీని—నీ వెందులకతని స్పృశించితివి? నీ వటు పొమ్ము. లే, లే!

దేవ—గురుని దేహసంరక్షణము శిష్యునిదని యాతఁడిదివఱకు బోధించిన యంశమును మఱచితివా?

శ్రీని—శిష్యుని దని చెప్పినాఁడా? శిష్యురాలి దని చెప్పినాఁడా?

దేవ—భక్తునిగూర్చి లింగభేదము చూడఁదగ దని యాతఁ డుపన్యసింపలేదా?

శ్రీని—భక్తునిగూర్చి యని చెప్పెనా? శిష్యునిగూర్చి యని చెప్పెనా?

దేవ—నే నిటకు భక్తి నభ్యసించుటకే కదా వచ్చితిని!

శ్రీని—నీ వభ్యసించి నిశ్చలభక్తురాలవైనప్పుడుచూచుకొనవచ్చును లే! ఇప్పుడు లే! అదిగో! ఆ దిక్కుమాలిన పైఁటచెఱఁగుతో విసరుచున్నా వేమి? ఆఁగు! నాప్రారబ్ధము—ఆగాలి నాకుఁగూడఁ దగులుచున్నది. (విప్రనారాయణుని చెవిలో) రంగరంగరంగా! రంగా

విప్ర—(లేచి) ఏఁడీ? కావేరిరంగఁ డేఁడీ! ఏఁడీ! కస్తూరిరంగఁడు! ఏఁడీ శృంగారరంగఁడు! ఏఁడీ! వైభోగరంగఁడు! ఏఁడీ! నా యొయ్యారి రంగఁ డేఁడీ! రంగరంగరంగా! (పడఁబోవును.)

శ్రీని—(పట్టుకొని) దేవా! తమ కొడలు తిరుగుచున్నది. పర్ణశాలకు దయచేయవలయును.

విప్ర—పర్ణశాల కేల? నన్నుఁ బట్టుకొని శ్రీరంగాలయమునకుఁ దీసికొని పొమ్ము! అచ్చట నాదివ్యమూర్తిని, నాముద్దులరంగని యొకసారి సేవింతును.

శ్రీని—మహాభాగ్యము! దేవర దయచేయుదురుగాక!

దేవ—నేనుఁగూడ వచ్చెదను.

శ్రీని—వలదు. నీవు పర్ణశాలకుఁబొమ్ము. నిన్నట మేము గలిసికొందుము.

దేవ—సరే! (అందఱు నిష్క్రమింతురు.)

ఇది ద్వితీయాంకము.



శ్రీ

# విప్రనారాయణచరిత్రము

## తృతీయాంకము

ప్రదేశము—విప్రనారాయణుని పుష్పారామము.

(ప్రవేశము—దేవదేవి.)

దేవ.—ఆహా! పాపకాలము! వేశ్యయింటిచుట్టు శృంగారవేషములతో విటులు దిరుగవలసి యుండ, వేశ్య నైన నేనే సన్యాసినీవేషమున విటుని సంపాదించుటకొఱకు కల్లలాడవలసివచ్చినది. ధనలాభమును గోరి యీతనికొఱకు దేవులాడుట లేదు. అతఁ డిచ్చున దేమి? సాలగ్రామతీర్థము! పోనీ! చక్కఁదనముఁజూచి యీతనికొఱ కేడ్చుచుంటి నేమో యన నట్టిరూపలావణ్యాదు లచట పూర్ణానుస్వారములు! వేశ్యావృత్తికి స్త్రీప్రకృతికిఁ గూడ ననరూపమైనపని సేయుచుంటిని. మాయక్కచే నెప్పుడో దాస్యము చేయించుకొనఁ దలఁచి, యిప్పు డీ బాపనయ్య కది యిది యనరాని కైంకర్యము సేయుచున్నాను. ఆతనికి దాసిన నైయుంటిని. కడుపునిండినయన్నమునకు మొగమువాచి, యొడలునిండిన గుడ్డకు మొగము వాచి యుంటిని. లోనఁ గడుపు మండుచుండఁగఁ బైకి మహానందమున రంగనామస్మరణము చేయవలయును. కాళ్ళువిఱుగఁ దాండవములు! నోరు నొప్పులువెట్టఁ బాటలు! చెవులు తడకలుగట్టఁ దాళపుదెబ్బలు! ఇంతకు మేళములో ముక్కాకలు దీరినదాన నగుటచే నీ ధాటి కింక నిలువఁబడినాను. అయినను మిక్కిలి శ్రమముగ నున్నది. లోపల విటాకర్షణావృత్తి — పైకి విష్ణుభక్తి! లోపల నింద్రియసమ్మర్దనోత్కం

రత — పైకి భాగవతో త్తమత ! లోపల సంగవాంఛాపాటవము— పైకి సన్న్యాసినీస్వరూపము ! లోపలఁ గ్రీడామందిరావాసాభిసంధి — పైకి శ్రీరంగాలయసందర్శనకుతూహలత ! లోపల భక్తుని బాదదాసునిగఁ జేసికొనుకోరిక — పైకి భక్తునిపాదములకుఁ బ్రణామము ! లోపల ననంగమంత్రజపము — పైకి నష్టాక్షరీ మంత్రజపము ! లోపలఁదలఁపులో దొంగతనము—పైకిమాటలో రంగనామము ! ఇట్టి స్వరూపము నిల్లు వెల్లడించుచున్నాను. లేని ప్రేమములు వెల్లడించుట, రానిరొదుపు లేపుట, కలుగని కోపములు గనఁబఱచుట, లేనివినయములు తెచ్చుకొనుట మొదలగు మదనమహేంద్రజాలవిద్యలలో విజయపత్త్రికఁ గొనినదానను గనుక నింతవఱకు దూసిపోకుండ నిలిచితిని. అయినను మిక్కిలి శ్రమముగ నున్నది. ఎంతశ్రమపడినను దుదకు సాధింపఁగల నను నాస యున్న నంతబాధ లేదు. ఆ ధైర్య మను మాటయే యెన్నఁ డెఱుఁగని నాకే యిట్లున్నది. నే నిటఁ బ్రవేశించి యెదుమాసములు దాఁటినది. అనేకపర్యాయము లతని దేహముతో నాదేహమును దగుల నిచ్చితిని. గిలిగింతలు పెట్టితిని. జుట్టు దువ్వితిని. పూలు ముడిచితిని. దేహమునకు గంధముఁ బూసితిని. కాళ్ళకు గజ్జెలు గట్టితిని. చిత్రచిత్రనృత్యము లనువంక నెన్నిమాఱులో కౌఁగిలించితిని. మోము మోమునఁ జేర్చితిని. పాదము లొత్తితిని. ఉహుహ్హు ! కరుగలేదు. కదలలేదు. మెదలలేదు. అదరిపడలేదు. టొంకలేదు. ఊఁహు,హ్హు ! ఒడలు జల్లు మనినట్లయినఁ గనఁబడలేదు. రోమాంచమైనఁ గలుగలేదు. తాతిబొమ్మ! మంచుగడ్డ! ఉక్కుతునుక ! వజ్రఫలకము ! చీచీ! ఆఁడుదాని కక్కుఱతురాని మగవానితను వేల ? ఈ నిర్భాగ్యునికట్టె యంత్యావస్థాగ్నిదీప్తికే కాని, యనంగాగ్నిదీప్తికక్కుఱకు రాదు.

(నేపథ్యమున) రంగరంగరంగా! రంగ! అంతమాట వలదు.

దేవ—అరుగో! గురుశిష్యు లిద్దఱుఁగూడ వచ్చుచున్నారు. నే నీ మాలతీలతచాటున నుండి వా రేమనుకొనెదరో విందును.

(విప్రనారాయణుఁడు శ్రీనివాసుఁడు ప్రవేశింతురు.)

శ్రీని—ఆలాగునఁ జెప్పు మని యిదివఱకుఁ జెప్పిరి కాదా? ఇప్పు డంత మాట వల దందు రేల?

విప్ర—(సందేహముగ) ఊఁ—ఊఁ—సరే—చె—ప్పు—చూడు— చెప్పిన బాధ యే మున్నది?

శ్రీని—బాధయా? బ్రదుకుదుము. పరువు దక్కించుకొందుము. భక్తి నిలుపుకొందుము.

విప్ర—ఆ భయ మేమియు లేదు! అందుచేత నే నట్లు చెప్పు మనుట లేదు.

శ్రీని—చిత్తము. పోయి చెప్పెదను.

విప్ర—చూడు! ఈ దినముననే యనుమాట యేమి? ఇంతలోఁ దొందర యేమి? రేపు చెప్పవచ్చును.

శ్రీని—అట్లు కాదు. క్షమింపవలయును. తలఁచుకొనినది శీఘ్రముగ నైన మంచిది. పోయెదను. సెలవిండు.

విప్ర—చూడు! సాయంకాలమునఁ జెప్పుదువుగాని, యిటు రా!

శ్రీని—నేను రాఁజాలనందులకు దేవర క్షమింపవలయును. ఇంతకాలము నకు మీ నోటివెంట నా మాత్రపుమాట వచ్చినది. పోవు చున్నాను.

విప్ర—ఉండు. ఇప్పుడే చెప్పక తప్ప దనుచున్నావు కాన — విను — మెల్లగ — మృదువాక్యములతో — మనసు నొవ్వకుండ— జాగ్రత్తగా—చెప్పవలయును. ఆమె బహు సుకుమారి సుమా!

శ్రీని—భవబాధాపరిత్యాగిని యగు భక్తురాలు కాదా!

విప్ర—కా దంటినా! ఆ మాట యిప్పు డెందులకు? నేను జెప్పినట్లు కాకుండ—నా మనసులోని యభిప్రాయ మది యై యుండు నని నీ వూహించినట్లుగ—తెలిసినదా?

శ్రీని—తెలిసినది. కాని—మీ యాజ్ఞ యని చెప్పునెడల పని జరుగును గాని, నాయూహ యని చెప్పినయెడల 'ఛీ! ఛీ!' యనును.

విప్రు—అయ్యయ్యో! ఆమె యట్టికఠినోక్తు లెన్నఁడైనఁ బలుకునా? పరమమృదులవాణీమనోహర కాదా!

శ్రీని—మహాత్మా! రంగనామముకంటె మృదుమధురమైన వాణి లేదని సెలవిచ్చితిరి కాదా! దానికంటె మృదుల మని మీ యభిప్రాయమా!

విప్రు—రంగ రంగ రంగా! ఎంతమాట నాడితివి! రంగ రంగా! (చెంపలు వైచుకొనును.) సరే, పొమ్ము!

శ్రీని—పోనిచ్చినయెడల నీసరికిఁ దిరిగి వచ్చియుందును. (పోవును.)

దేవ—(తనలో) ఏదియో నాకుఁ గొంతబాధ నిచ్చెడు మాటను జెప్ప వచ్చుచున్నాఁడు. ఈ శిష్యుని బలాత్కార మెక్కువగ నున్నది. కానీ! సరసశృంగారలీలాకలాపధళధళాయితరూప సౌభాగ్యము వదలినది కదా! తస్కరవిరాగిసవేషము వచ్చినదికదా! మహారాజులను మంచఁపుఁగోళ్ళకుఁ గట్టించుమహిమము మున్నఁ గలసినది కదా! పరమదరిద్రకురూపనపుంసకాధమాధముఁ డగు వానివెంట 'మగఁడో మగఁడో' యని యఱచుచుఁ బ్రాఁకులాడిననైన నతఁడు నన్నుఁ గ్రేఁగంటనైనఁ జూడనట్టి దురవస్థ ప్రాప్తమైనదికదా! ఇంతకంటె నైచ్య మేమి రాఁగలదు? వచ్చునెడల రానీ! నైచ్యము భక్తికి మంచిదే కాదా! దొంగభక్తి పోయి నిజమైనభక్తి కుదిరినయెడల నదృష్టవంతురాలనే! లేదా, యజ్ఞోపవీతమును మెలికవైచి భక్తుని వేశ్యావీథి కీడ్చి తెచ్చి మేళములో నావెనుక నీతని తాళఁపుహంగునకై పెట్టి యింతటినుండి సానులమేళములో శ్రీవైష్ణవులు చిప్పతాళపుహంగుఁ జేయవచ్చునను సదాచారమును స్థాపించి శాశ్వతకీర్తి నైనఁ బొందుదును.

(నేపథ్యమున) దేవదేవీ! దేవదేవీ!

దేవ—శ్రీనివాసుఁడు పిలుచుచున్నాఁడు. నే నిట్టె లోనికిఁబోయి యీ సారి పిలిచినప్పుడు కానఁబడుదును. (పోవును.)

శ్రీని—(ప్రవేశించి) దేవదేవీ! దేవదేవీ!

(నేపథ్యమున) శ్రీనివాసా!

శ్రీని—ఆఁ! ఇచ్చటకు రమ్మా.

దేవ—ఎందులకు?

శ్రీని—ఎందులకో వినుటకే—

దేవ—(ప్రవేశించి) ఏదీ? వినఁ దలఁచితిని. శీఘ్రముగఁ జెప్పుము.

శ్రీని—శీఘ్రముగఁ జెప్పుట కది మంచిమాట కాదని సంకోచించు చుంటిని.

దేవ—నీవు సంకోచింప నక్కఱ లేదు. నేను గీడును సంకల్పించు కొనియే యిల్లు వదలి యిటఁ జేరితిని.

శ్రీని—ఆఁ! ఆఁ! నీవు సంకల్పించుకొనిన కీ డేమి?

దేవ—ఆత్మహత్య! అది సాఁగినది కాదు. అంతవఱకు సిద్ధపడి యున్న దానికి నీ కీడుమాట లెక్క యేమి?

శ్రీని—నీ విటకు వచ్చి యైదుమాసములు దాఁటిపడి కాఁబోలు నేమి?

దేవ—అయిన నేమి?

శ్రీని—పాపము! నేఁటితో నీకు గురుసేవఋణము తీఱిపోయినది!

దేవ—రంగ రంగా! గురువులవా రాకస్మికముగఁ బరమపదించినారా?

శ్రీని—(చెవులు మూసికొని) పాపము శాంతించునుగాక!

దేవ—లేక భ్రష్టు లైరా?

శ్రీని—నీవింక నిచ్చట నుండిన నేమగునో కాని, నిన్నిటనుండి వెంటనె యెక్కడకైనఁ బొమ్మనినారు.

విప్ర—(తనలో) పాపము! వెడలిపోవును గాఁబోలు! అయిదు మాసములనుండి రంగనామస్మరణమున, రంగగాథాగానమున, రంగ భక్తిప్రేరితతాండవమున నెంతయో తోడ్పడి యున్నది. ఛీ! ఛీ!

పుట్టిననాఁటనుండి పోషించి భక్తినొసఁగిన రంగనికంటె నాకుఁ బో డెవ్వఁడు? రంగనికంటె ది క్కెవ్వఁడు? రంగ రంగ రంగా! (లెంపలు వైచుకొనును.)

శ్రీని___మాట లాడ వేమి? అది గుర్వాజ్ఞ గావున నెంతశీఘ్రముగఁ బోయిన నంత విధేయతఁ గనఁబఱిచినవాఁడ నగుదువు.

దేవ___నాకుఁ బరమసంతోషకర మగు వార్తను జెప్పితివి. (తనలో) ఇది నాకు నిశ్చయముగ సంతోషకర మగు వార్త. నామనోరథ మింక నెఱవేఱఁగలదు. ఇప్పటికి నేను స్త్రీనని యాతనికిఁ దెలిసినది. నా స్త్రీత్వపరిభావ మిప్పటికి బ్రహ్మరంధ్రమున కెక్కినది. నే నిదివఱకు నెల్లడించిన శృంగారభావచేష్టలిప్పటికి జీర్ణమై రక్తమునఁ గలిసి ప్రవహించుచున్నవి. మోటమొండితత్వము కావున నింతయాలస్యమైనది. ఇఁక భయము లేదు. ఇఁక నొకటి రెండు మోతాదులతో వ్యాధి తిరుగును. ఐహికవ్యాధి నుదిరిన నరుఁడు మంచమునుండి దిగును. అప్రాపంచికవ్యాధి యైన భక్తరోగము నశించినవాఁడు మంచమెక్కును. ఇది మాత్రమే భేదము. కాని రోగము కుదురుటమాత్రము నిశ్చయము. (ప్రకాశముగా) శ్రీనివాసా! నేను బోయెదను గాని పొమ్మనుటకు గురువులవారికిఁ గారణ మేమి?

శ్రీని___కారణమునుగూర్చి నాతో నాతఁడు చెప్పియుండలేదు.

దేవ___నీ వేల యడుగక పోయితివి?

శ్రీని___నీవు నన్నడుగుదు వని తెలియక.

దేవ___నాకుఁ జెప్పకపోయిన నీకైనఁ దెలిసియుండ నక్కఱలేదా?

శ్రీని___పొమ్మనువాఁ డాతఁడు; పోవుదానవు నీవు. నడుమ కారణజ్ఞానముతో నాకుఁ బ్రయోజన మేమి?

దేవ___అయినను గారణ మే దని నీ వూహించితివి?

శ్రీని___ఇదివఱ కూహించి యుండలేదు.

దేవ___ఇప్పుడు యోజింపఁగలవా?

శ్రీని—ఏ మున్నది ? ఇట నీ వుండుట కిష్టత లేకపోవుటచేత—

దేవ—ఏల ?

విప్ర—(తనలో) పోమ్మనుట నా కంత యిష్టమే కాదు. శ్రీనివాసుని ప్రోత్సాహ మెక్కువగ్గున్నది. ఆమెవలనఁ దప్పేమియుఁ గానఁబడదు. నిశ్చలభక్తియుక్తురాలు! అది రంగనామస్మరణముఁ జేయు వీణ మీటుచున్నట్టుగ నుండునది. అది యేమోకాని—కొలఁదిదినములనుండి—నాకు—ఒకవిధమైన యస్వస్థత—అభూతపూర్వమైన యొకయుత్సాహము—విచారపూర్వకమైనదీర్ఘాలోచన మొకపుడు—రేలఁ దఱచుగ నిద్రాశూన్యత—మనసు మఱియొకదారినిబోవుచున్నదేమో యను వెఱ్ఱిభ్రమము—అంతలోనే ద్విగుణీకృతభక్తిప్రబోధితగాఢతాండవప్రారంభము—తాండవించుచుండఁగనే యంతలోఁ బరాకు—ఏదో పోయినట్లు వెదకుకొను బుద్ధి—చూపుల కొకవిధ మగు చలనము—తొట్రుపాటు—నిర్వర్ణింపలేని యొకవిలాసము—అభిముఖమార్గాభిగమనముగాక—తఱచు పార్శ్వగమనము—అంతలో నట్టె సంకోచము—ఏదియో వచ్చి యానందింపఁ జేయు నను నొక పెద్దయాస—నా కింక నభోగతియే యని యకారణముగ లోనఁ గలిగిన గుబులు—దేహమున కట్టె యట్టె యొకపు డుత్కృష్టత—ఒడలు చల్లఁగ నుండియుఁ లోనఁ దాపము—నిష్కారణ నిశ్వాసములు—భక్త్యుద్రేకము లేనపుడుకూడ బాష్పనిష్యందము—మన సేమో యూఁగిన ట్లొకపుడు—గిరగిర తిరిగిన ట్లొకపుడు—పామువలె నడచిన ట్లొకపుడు—ఉత్సాహమునఁ బొంగున ట్లొకపుడు—ఏదియో దాఁటిన ట్లొకపుడు—లోనికి దిగిపోవుచున్న ట్లొకపుడు—ముడుచుకొని ముడుచుకొని మూల దాఁగిన ట్లొకపుడు—నన్ను విడిచి యెక్కడికో పోయిన ట్లొకపుడు—గట్టిగఁ బట్టుకొనఁజూచినకొలఁది మంచుగడ్డవలెఁ బట్టు జాఱిపోవున ట్లొకపుడు—ఏమి ? ఇది యాధియా?

వ్యాధియా? రెండునా? చిరకాలమునుండి కనిపెట్టుకొని కష్ట నిష్ఠురతల కోర్చిన శ్రీనివాసునిజూడ నేమో యుదాసీనత!— నిన్నఁగాక మొన్న వచ్చిన దేవదేవిని జూడ నేమో యుత్సాహము! ఇందులకుఁ గారణ మే మనుకొనను?

దేవ—శ్రీనివాసా! మాటలాడ వేమి? గురువులవారికి నాపై నిష్ఠ లేకపోవుట యేల?

శ్రీని—నీపై మిక్కిలి యిష్ట ముండుటచేతనే నిన్నుఁ బొమ్మనినారు.

దేవ—అది న్యాయమేనా?

శ్రీని—అభక్తుల కది విరుద్ధము గాని, భక్తుల కది న్యాయమే! భక్తుని కిష్టపదార్థ మొక్క శ్రీరంగఁడుతక్క నేదియు నుండఁగూడదు. ఇదిగో! నీవుగూడ భక్తురాలవే కదా! నీ కీ తత్త్వము నేఁ జెప్ప నేల?

శ్రీని—(తనలో) అది యెందు కగుటచే నిట్టి యననుభూతపూర్వావస్థలు కలిగినవేమో యని—భ్రమపడి—మనశ్చలనము కాదు—భక్తి సంకోచము కాదు—ప్రాపంచికాభిముఖత కాదు—ఒకటి తలఁచుకొనఁబోవ నొకటి వచ్చుట—అనఁగ—రంగని దలఁచుకొనఁబోవ, భక్తునిపై బుద్ధి పారుట—రంగనికి రంగరంగా యనుచుఁ బూలుగ్రుచ్చుచుండ, భక్తురాలి వినయవిధేయతా గురుశుశ్రూషతా సద్గుణసంపత్తిని గూర్చి యకారణముగఁ దలఁపు వచ్చుట—ఒకటి యన నేమి? మన సేమో రెండు భాగము లైనట్లును—దేహమునకు మును పెఱుఁగని విచిత్రసుఖ మేదియో కలుగుటచేత—నీ దేహము తత్పునరనుభవము నపేక్షించుచున్న దేమో యను సందేహ మాత్మకుఁ గలుగుట చేత—ఎందుల కైన మంచి దని—ఆమె నిశ్చలభక్తురాలు కావున నామె కెక్కడ నుండినను లోపము లేదని—ఇప్పటివఱ కంతబాధ యేదియు లేకున్నను—ముం దేది కలుగఁబోవునో యని సందేహించి—కొంచెము దూరముగ నుంచిన సర్వవిధ

ముల మంచిదే యని యెంచి—యామెను స్వగ్రామమునకు వెంచేయఁ బ్రార్థించితి నని చెప్పు మని శ్రీనివాసు నంపితిని. ఈసరి కామెతోఁ జెప్పి యుండును. ఆమె నన్నుఁ గూర్చి యే మనుకొనునో? లోప మేదైన నున్నయెడల నది నాది కాని యామెది కాదు. (ముక్కు మీఁదఁ జేయి వైచుకొని) రంగరంగ రంగా! రంగా! రంగనామస్మరణమును నిరభ్యంతరముగాఁ జేసి కొనవలయు నని యిచ్చటఁ గూర్చుండి తదితరవిషయముల నన్నియుఁ దలఁచితిని. ఇట్టి మనోవికారమే—ఇట్టి యస్వాధీన చిత్తతయే యిప్పుడు ముఖ్యముగ నాకున్న బాధ. ఇది యెట్లు కలిగినను మాన్పుకొనక తప్పదు. అందులకుఁ బ్రశాంతత—నిరుపహతస్థలస్థత కావలసియున్నవి. శ్రీనివాసుఁ డింతకాలము నుండి యున్నాఁ డనుమాటయే కాని యతనిజోలి యుండ నిది. అతఁడు నాకు లేనట్లుగనే ప్రవర్తించినాఁడు. కాని—యీ భక్తిగాలు—భక్త్యుత్కంఠతచేఁ గాఁబోలు!—గురు సేవామహత్తిచేఁ గాబోలు!—నాతో స్మరించి—నాతోఁ బాడి—నాతో నాడి—సర్వోపచారముల నాకుఁ జేసి—యనవరతముఁ గనిపెట్టి యుంటచేతఁ గాఁబోలు—నిట్టి విచిత్రావస్థ కలిగినది. కాన—ఈమెను దూరమున నుంచుటకంటెఁ బ్రస్తుతమున మార్గాంతరము గోచరింపదు. రంగరంగరంగా! రంగ!

దేవ—నీవు నాతోఁ జెప్పవలసిన దేదియు లే దంటివి కాన నేమఁబోయి గురువులవారినే యడిగెదను.

శ్రీని—నీ వింక నాయనతోఁ జెప్పుకొనవలసిన దే మున్నది?

దేవ—ఏమియుఁ జెప్పకపోయిన సెలవైనఁ దీసికొన వలదా?

శ్రీని—ఆయన సెలవును మదీయముఖమున నీకుఁ బంపిరి కాదా!

దేవ—నీ మొగముసెలవుతో నాకుఁ బనిలేదు. నే నిచ్చట నుండుట నీకు మొదటినుండియు నిష్ట మున్నదా? నన్ను వదల్చుకొనఁగ నీవే యిట్లు మోసము చేయుచుంటి వేమో?

శ్రీని—నీబాధ నా కేమి యున్నది?

దేవ—గురువులవారి కే మున్నది?

శ్రీని—ఆయన కేదియో భయ ముండుటచేతనే పొమ్మనినారు.

దేవ—అది స్పష్టపఱచుకొనుటకే గురువులవారిదర్శన మొనర్ప వలయును.

శ్రీని—ఆయన నిన్నుఁ దీసికొని రమ్మని నాతోఁ జెప్పియుండలేదు.

దేవ—తీసికొనిరావల దని చెప్పియుండకపోవుటచేత వచ్చెదను.

శ్రీని—అటులైన రమ్ము. నీవు వచ్చితి వని యాయనతోఁ జెప్పవలెను. నీ వాతనియెదుట నిలువక చాటున నుండుము.

దేవ—ఆతని కీ దొంగభయ మేమి? నాకు దోఁచుచుండుట లేదే! నడుమ నీ సంధాన మేమి?

శ్రీని—ఏమియు లేదు. కూడ రమ్ము.

(ఇద్దఱును విప్రనారాయణునియొద్దకుఁ బోవుదురు.)

శ్రీని—నీ వీతులసికోటచాటున నుండుము. నేను గురువుగారితో మనవి చేసెదను. మహాత్మా! దేవదేవి యిటకు వచ్చినది.

విప్ర—ఏదీ!

శ్రీని—తులసికోటచాటున నిలువఁబెట్టితిని.

విప్ర—నేఁ జెప్పినయంశమును దానితోఁ జెప్పితివా?

శ్రీని—చెప్పితిని.

విప్ర—ఏ మనెను?

శ్రీని—ఏ మున్నది? పోయెద ననెను.

విప్ర—సంతోషపూర్వకముగనే యనినది కద!

శ్రీని—ఎట్లో యొక ట్లనినది.

విప్ర—ఎటులయిన నేమి? పోవుట కావలసినది. సరే! కాని యిప్పుడు దీని నిట కేల తెచ్చితివి?

శ్రీని—ఆమెయే వచ్చినది.

విప్ర—ఏల?

శ్రీని—మీదర్శనముచేసి సెలవు తీసికొనుటకు—

విప్ర—సెల విదివఱకే యీయఁబడినది. నాదర్శనముతో నేమి పని యున్నది? నే నొక్క రంగనిదక్క నితరులఁ జూడ దలఁచుకొన లేదు. అట్టి వ్రతనిశ్చయుఁడ నైతిని. కావునఁ బోవచ్చునని చెప్పుము.

శ్రీని—(దేవదేవియొద్దకుఁ బోయి) మహాత్ముఁడు దర్శన మీయఁడఁట. వెడలి పొమ్ము.

దేవ—సరే! నీవు గురువులయొద్దకుఁ బొమ్ము.

(శ్రీనివాసుఁడు విప్రనారాయణునియొద్దకుఁ బోవును.)

దేవ—(తులసికోట చాటుననే యుండి) దర్శన మీయ నంటిరా? మహాత్మా! కోరినది దర్శనమాత్రమే కదా! ఇంతలో మీకుఁ జెడిపోవున దేది? నాకు లాభించున దేది? మొగము చూపుట తోడనే నాకు మోక్షప్రాప్తి యగు ననుకొంటిరా? ఈ మాత్రమునకే యింతనిర్దాక్షిణ్యముగ నిరాకరింపఁ దగునా? చూచి నంతమాత్రమున మిమ్ముల నే నెత్తికొని పాఱిపోవుదు నను కొంటిరా? ఏల మీకీ సందేహము? భక్తశిఖామణు లగు మీకీ పట్టుదల యేల? దర్శనమే యీయరా? ఆఁ! ఎంతమాట! రంగనిమొగము ప్రసన్నముగ నుండలే దని గిజగిజ కొట్టుకొని దేవులాడితిరే! జ్ఞప్తి లేదా? తారకమార్గమునకై మీ రొక నిదర్శనమును గోరి పడరానిపాటులు పడుచున్నారు గదా! మీరే సర్వము నిచ్చి మీవలననే కడతేఱవలయు నని నమ్మి యున్న నాకు మీరు దర్శనమీయకుండ నిరాకరించిన నెంత క్షోభముగ నుండునో పరతంత్రతాకష్ట మెఱింగిన మీకే తెలియకపోవుట యేల? ఒక్కపూట రంగనియాలయములోనికి మిమ్ము రానీయకుండ నిరాకరించినచో మీమన సెట్టు లుండునో? ఇదియేనా మీభూతదయాపాటనము! సర్వానము లని,

జ్ఞానసంపన్నులని, కరుణాప్రపూర్ణులని, శేషగుణసనాథు లని మి మ్మాశ్రయించితినిగాని యధికారతారతమ్యమును జూతు రనుకొంటినా? ఆశ్రితజనేంగితజ్ఞానశూన్యతగ నిరాకరింతు రనుకొంటినా? క్రూరమనస్కతచేఁ బొమ్మందు రనుకొంటినా? పాదములపైఁ బడినదానిని, ప్రబలగర్వాతిరేకమున మొగమునఁ జూపక పాఁజదోలుదు రనుకొంటినా? అందఱి మొగములందుకంటె మీతిరుముఖమందు లావణ్యాదు లధిక మని చూడ వచ్చితినా! ఈ మాత్రపు మొగమునకు దృష్టిదోషము తగులు నని నిరాకరించితిరా? మీ కెఱ్ఱఁగంటి చూపులతో నా పాపము లన్నియు నొకమాఱు భస్మము లగునని యే చూడ వచ్చితినా! అందులకే వచ్చియున్నను మీ రిట్లు మొగమోటమి లేక నిరాకరింపఁదగునా! దర్శన మఁట! ఈయ రఁట! ఏమో? దర్శన మేమి తత్త్వజ్ఞానమా? కైవల్యమా? పరమపదమా? భక్తులకు దర్శన మిచ్చి సంతసింపఁ జేయ లేని మీ తిరుముఖమండల మేఁ లెందులకు? రంగమూర్తియే సమస్తజనసందర్శనప్రదాతయై, యఖిలభక్తవత్సలుఁడై, సర్వసులభుఁడై దుర్లభమైన పరమపదమును సహితము భక్తుల కిచ్చెద నని శపథము చేయునట్లు తిరుత్తుళ్ళాయిని శిరముపై ధరించియుండ రంగభక్తు లగు మీ కీ స్వాతంత్ర్యచింత లేల? చతుష్పాదజంతు వగు గజేంద్రుఁడు భక్తితో భూమినుండి కేకలు వేయ, వైకుంఠమునుండి, భార్యతోఁ జెప్పక, పెరియ తిరువడిని చూడనే చూడక, పైన నుత్తరీయ మైన నున్నదో లేదో యెఱుఁగక, పాదచారియై పరుగు లిడుచు ధావనావేగమునఁ గట్టుబట్ట యట్టె చలించుగొజ్జనుండి జారిపోవ, నిలువఁబడి బిగించుకొనిన నాలస్య మగు నేమో యని చేతితోడనే కుచ్చిళ్ళు సడలిపోకుండఁ బట్టికొనుచు నెందులకో యేమి చేయవలయునో కూడ నెఱుఁగని మహోత్కంఠతచేఁ దనకొంప మునిఁగిపోయినట్లు, తనపుట్టి మునిఁగినట్లు శ్రీ మహావిష్ణువు వచ్చి తన దివ్యముఖార

విందసందర్శనసేవ గజేంద్రునకు సాయించి యుండ, స్పష్ట విష్ణుని పాదదాసు లని, భక్తు లని, ప్రపన్ను లని లోకముచే నెన్నం బడుచుండు మీరు—అట్టిమీరు—అయిదు మాసములనుండి మి మ్మాశ్రయించి, సేవించి, పూజించి, మిమ్మే మహావిష్ణునిగ నమ్మకొని తరింపవలయు నని యెంచి — తులసికోటచాటున నిలునంబడి "దర్శనమో, దర్శనమో" యని పెరుమాళ్లుకోవెల చుట్టు గోపురములు ప్రతిధ్వని నిచ్చునట్లు మొఱ్ఱో యని యఱవ — చెక్కు - చెదరకుండ — నలుసంత యావేగమైన నొందక — పాపము! అస్వతంత్రురా లెందులకు దర్శనము వాంఛించుచున్నదో తెలిసికొంద మను కొంచెము చింతయును లేక — "దర్శనమునకు వీలు లేదు" అని, యాహా! ఆహా! వార్త నంప సాహసించితిరి! సెబాస్! ఇది మీకే తగును! మీ మొగమువంటి మొగములు లోకమున నెన్నికోటులు లేవు. తుచ్ఛు లగు విటాధముల మొగము చూడనొల్లక మీ మొగముం దంతకంటె దైవకటాక్షవిశేషమున నేదియో కించిదాధిక్య మున్న దనియేకదా యిచ్చటకు వచ్చితిని. ఆ మాత్ర మాలోచించుకొన నక్కఱ లేదా?

విప్ర—రంగరంగరంగా! దాని నిచ్చటకు రమ్మని చెప్పుము.

శ్రీని—వలదు. వలదు. అందువలన నేమి ప్రయోజన మగునో?

విప్ర—ప్రయోజన మే మున్నది? ఆమె చెప్పినట్లు, దర్శన మిచ్చుటలో మహాకష్ట మే మున్నది! ఇచ్చుట యిచ్చుట యనుటే కాని యేమి యీవలయును? తలందీసి యామె చేతిలోం బెట్టవలయునా! మొగ మెత్తుకొని యొక నిముస ముండలేనా? కన్నులు తెఱచుకొని యొకయింతసే పుండలేనా? కష్ట మేమియు లేదు. వైష్ణవులమైన మన కిది తగదు. ఆమె మాటలు సహేతుకములుగ నున్నవి.

శ్రీని—దేవా! నా మనవి వినుఁడు. వలదు. ఎదుటకు వచ్చిన తరువాత నామె తిరిగి పోదు. మీరు కఠినముగఁ బొమ్మన లేరు.

విప్ర—అదేమి మాట? ఇదివఱకు నేను బొమ్మనకుండనే నీవు చెప్పితివా? తిరిగిపో దని యెట్లు చెప్పఁగలవు? దర్శనమునకు రావల దనిన నిన్నిమాటలు తులసికోట చాటున నిలువఁబడియే యాడినది కాని యెదుటఁ బడినదా? తల సిగ్గు వంచియైనఁ జూచినదా? అట్టి గుణవంతురాలు—

శ్రీని—అయ్యయ్యో! అది కనఁబడునో లేదో యని యట్లు మీరు చూచుచున్నారా?

దేవ—అయ్యా! మహాత్మా! ఇంకను దర్శన మీయరా? నావలన పాప మేమి కలిగెను? విటుల కీ దేహము నమ్ముకొనకుండ మీ కర్పణము సేయుట పాప మయ్యెనా? దుష్కృతిభూయిష్ఠమైన యిల్లువదలుకొని మీ పుణ్యవనమునకు వచ్చుట పాప మయ్యెనా? త్రాగుడును మాని తులసి తీర్థమును పుచ్చుకొనుట పాప మయ్యెనా? జారుల తెంపలు వాయించుట మాని వీరవైష్ణవుని పాదము లొత్తుట పాప మయ్యెనా? బూతుకూఁతల మాని పాశురములఁ బఠించుట పాప మయ్యెనా? మిరియాల పూసల పేరులు పారవైచి తామరపూసల పేరులు వహించుట పాప మయ్యెనా? చీనాంబరము వదలి చినుగుల జేగురుగుడ్డను గట్టుకొనుట పాప మయ్యెనా? మీకుఁ దిరుమంజన మొనర్చితినే! మీకాళ్ళు గడిగి తీర్థముగఁ ద్రావితినే! మీబట్ట లుదికితినే! మీయెంగిలిమెదుకులు శ్రీమహావిష్ణు ప్రసాద మని కనుల కద్దుకొని భుజించితినే!—ఇట్టిసేవలో బహునాలుగవభాగము శ్రీరంగమూర్తికే నేను జేసియుండినయెడల నాతఁడు — నన్ను — నన్ను—నిష్కపటహృదయనైన నన్ను — దిక్కుమాలిన యేకాకినైన నన్ను—అనన్యశరణ్యనైన నన్ను — ఆపన్ననైన నన్ను —- ఆఁ! ఆఁ! ఇట్టి నన్ను—

విప్ర—భక్తురాలా! ఇటు రమ్ము.

దేవ—(పరుగునఁ బోయి) ఇదిగో! వచ్చితిని. శ్రీ విప్రనారాయణ మహాగురవే నమః. (చుట్టు తిరిగి సాష్టాంగ మాచరించును)

విప్ర—అడియేఁ దాసోహం. (తనలో) ఈమె నాచుట్టు నెట్లు గిరగిర తిరిగెనో నా చిత్తమట్లు తద్గమన మనుసరించి లోన స్వప్రదక్షిణము చేసెను.

శ్రీని—(తనలో) ఇక్కడినుండి యింక నేను బోవలయును గాని యీమె కాసియుండ బోదు. గురువుగారికి రంగనిపై భక్తి పోవలయును గాని దీనిపై నభిమానము పోదు.

దేవ—స్వామీ!

శ్రీని—ఇంక స్వామి యెందులకు? దర్శన మైనది కాదా! పొమ్ము.

దేవ—దర్శన మైనది కాని, సెలవు పుచ్చుకొనుట యయినదా?

శ్రీని—ఇచ్చుట కాయన కేమున్నది? పుచ్చుకొనుటకు నీ కేమి కావలయును? దయయుంచి వేగ దయచేయుము.

దేవ—ఏమి మహాత్మా! నేను సెలవు తీసికొని పోవలసినదేనా?

విప్ర—భాగ్యము! (తనలో) రంగ రంగ రంగా! రంగ!

శ్రీని—సరి! సెలవైనది. నడు; నడు!

దేవ—ఊరక తొందరపడెద వేమి? మీ కిష్టము లేనపుడు పోక యిచ్చటనే యుండెద ననుకొంటివా?

విప్ర—శ్రీనివాసా! అది పోదని చెప్పితివి కాదా! మనదొద్ద దాని కేమి కాణాచియా? మన మేమి దానికిఁ బంచభక్ష్యపరమాన్నములతో నారగింపు లిడుచుంటిమా? మనము దానిచేత దాస్యము చేయించుకొనుటయో తక్క నది యానదుమ రోగముతోఁ బడి పోయినప్పుడైనఁ గాసంత యుపచార మొనర్చితిమా? ఇల్లును, దల్లిని, దోఁబుట్టువులను విడిచిపెట్టిన దిట్టి మనల నేల విడిచిపెట్ట లేకుండు నని యెంచితివి?

శ్రీని—ఇప్పుడు దేవరవారి నైచ్యానుసంధానము, స్వదూషణమును దానికిఁ దగినంతయుపచారములు చేయలే దనుటనుగూర్చియా?

విప్ర—రంగ రంగ రంగా! ఎట్లు గ్రహించితివి? భక్తురాలా! నీవు మా కంటె గుణసంపన్నురాలవు. మా కంటె దైవానురాగాధిక్యయుక్తురాలవు. మాకంటె నిశ్చలచిత్తవు. అయిన నేమి? సంసారులలో నొకనితో నొకఁడు కలసి విడిపోవుట యెట్టులో భక్తులలోఁ గూడ నట్లే. మాయందు దయయుంచి నీవు దయచేయుము. అన్యథా యెంచకుము. (తనలో) రంగ రంగ రంగా! ఏదో యొకటి శీఘ్రముగఁ దెగతెంపు చేసికొనినఁ గాని మనస్సు శాంతిగ నుండదు. అబ్బ! రంగ రంగ రంగా! రక్షింపు. అపరాధుఁడను. అవగుణుఁడను. చంచలచిత్తుఁడను. రంగ రంగ రంగా!

దేవ—ఇఁకఁ బోవలసినదేనా?

శ్రీని—కిక్కురుమనకుండ—

దేవ—రంగ రంగ రంగా! రంగా! (ఏడ్చును)

విప్ర—అయ్యయ్యో! నిష్కారణముగ నిర్దోష నేడ్పించితిమి గదా! శ్రీనివాసా! నాగుండెలు తల్లడిల్లుచున్నవి. దాని నిఁక నేమన వల దని చెప్పుము.

శ్రీని—మన కెవఁడు చెప్పు నయ్యా!

విప్ర—అట్లాడెద వేల? మన కంతపట్టరాని చింత యే మున్నది? ఏమో! కొలఁదిదినములనుండి కన్నులయెదుటఁ దిరిగినది గదా యని కాని—ఇంతకుఁ బరమయోగ్యురాలు! పరమ శాంతాత్మురాలు!—

దేవ—రంగ రంగ రంగా! (ఏడ్చుచున్నది)

విప్ర—రంగ రంగా! ఎంత పాపము! నాకు బుద్ధివచ్చిన దాదిగ నేడు పెట్టిదో వినలేదు. అట్టిచో నాతులసీవనములోనే, నాకన్నుల యెదుటనే నాకు సర్వోపచారము లొనర్చిన రంగదాసురాలే

కఠినమగు నాయాజ్ఞమూలముగనే యేడ్చుచుండ నేను సహింపఁ
గలనా? శ్రీనివాసా! నీవు పోయి యూరకుండు మని
చెప్పుము. లేదా నే నెచ్చటికైనఁ బోదును.

శ్రీని—(తనలో) ఈతఁ డిటనుండి పోయిన మంచిదే కాని కదలనిచ్చిన
నీతనివెంట యీమె పడిన మహాప్రమాదము సంభవించును.
(ప్రకాశముగ) మహాత్మా! తాము మఱియొక చోటికి దయ
చేయ నేల? దేవదేవీ! ప్రశాంత మగు నాశ్రమవనమును రోద
నమున నపవిత్రమును జేయుచున్నావు. పో! పో! శీఘ్రమునుగఁ బో!

దేవ—(కోపమును నటించుచు బిగ్గఱగ) పోక పోవుదునా? పోకపోవు
దునా? ఇదిగో! (వేగముగ నడచును)

విప్ర—(తొందరతో) శ్రీనివాసా! ఆఁగు మని చెప్పుము. ఈమె
నైఖరిఁ జూడ భయముగ నున్నది. ఎచ్చటికిఁ బోవునో శీఘ్ర
మడుగుము.

శ్రీని—ఎచ్చటికిఁ బోయిన మన కేమి మహాత్మా! పిశాచమును
వదలనీయరా!

విప్ర—శ్రీనివాసా! నీకుఁ దెలియదు. దేవదేవీ! ఎచ్చటకు బోఁ
దలఁచితివి?

దేవ—ఎచ్చటకుఁ బోయెదనా? రంగ రంగ రంగా! మీయొద్దనుండి
నిష్కారణముగ మీరు గెంటివైచుటయే కాక నాప్రయత్న
మును విఘ్నముగూడఁ జేయున ట్లపశకునపుమాటలఁగూడ
నాడుచున్నారా?

విప్ర—చూచితివా? శ్రీనివాసా!

దేవ—స్వామీ! ఎచ్చటకుఁ బోవలయునో చెప్పవలయునా?
స్వామీ! శిష్యుల కాచార్యాభిమానమే కాని యాచార్యు
నకు శిష్యాభిమాన మక్కఱలేదా? ఆహా! దిక్కుమాలిన
యీబొందిలో నున్న యాత్మ నెంత సంతోష పెట్టితివి?
చాలు, చాలు! ఎక్కడకుఁ బోనుంటినో చెప్పవలయునా?

మీ పాదసేవ నాకు లభింపదు గాని నాకష్టము లెట్లో కడ
తేఱకపోవునా? కడుపుచల్లని కావేరమ్మ లేదా? శ్రీరంగ
మూర్తి కిన్ని గోపురమండపాదులు గట్టుటకు భక్తు లిన్ని
కోటులరాళ్లు సంపాదించినప్పుడు నాగొంతుకకుఁ గట్టుకొనుట
కంతరాయి తెచ్చుకొనలేక పోవుదునా?

విప్ర—వింటివా? శ్రీనివాసా! నామూలమున నామె కెంత పర్యం
తము వచ్చినదో!

శ్రీని—ఆమెమూలమున మీకు వచ్చినంతముట్టున కింక రాలేదు లెండు.
ఆత్మహత్యలో మొదట నశించునది శరీరము. భక్తిభ్రష్టతలో
ముందుగ నశించునది యాత్మ. లోకము మీకొఱకు విచార
పడవలసిన స్థితికి రానై యుండ మీ రామె కొఱ కేల
విచారింతురు?

విప్ర—రంగరంగరంగా! నాకు భక్తి నశించుచున్న దనుచుంటివా?

శ్రీని.—నే ననుట యెందులకు? మీకుఁ దోఁచుట లేదా?

విప్ర—నీ వాలోచింపకుండ నేల మాట లాడెదవు? మనము పొమ్మను
టచే నామె మరణింపఁబోవ నున్నది. కాన భక్తాభిమాన
మున, భూతదయాప్రోత్సాహమున, ప్రత్యక్షదుష్కార్యారంభ
విఘ్నకరణాపేక్షచే నట్లంటిని గాని, లోకములో నందఱికంటె
నామె నా కెట్లధిక యగును? నాకన్నుల యెదుట జగత్తున
నెందఱు స్వాభావికమరణము లొందలేదు? ఎందఱు బలా
త్కారమృతుల నొందలేదు. వారందఱకొఱకు నేను విలపించి
తినా? మా తలిదండ్రులు నాయెదుటఁ బరమపదించినపుడు
నేను గంట నీరైనఁ బెట్టితినా? అంత నిర్లిప్తతగఁ గాలక్షేపము
సేయుచున్న నేను దీని చావుకొఱకు వగ నొందుదు నను
కొంటివా? నేను జచ్చినఁగాని నారంగభక్తి నశించునా?
**అది చచ్చిన సరే! లోక మంత వినాశ మందిన సరే!**

శ్రీని—(తనలో) పాపము! జ్ఞాని మరణ మీమహాత్మునకు లోకవినాశముగ నున్నది కాఁబోలు! స్త్రీసాన్నిధ్యమువలన బుద్ధిపూర్వకముగ నీతనిలోఁ గలిగిన మార్పును భూతదయామాహాత్మ్య మని, కష్టదర్శనాసహిష్ణుత యని, పరిచయసంజాతాభిమాన మని యీఁతడు భ్రమపొందుచున్నాఁడు. పాపము! ఋశ్యశృంగునివంటివాఁడు! అయిన నేమి? చెడిపోవ నున్నాఁడు.

విప్ర—వింటివా? శ్రీనివాసా! నా కిచ్చట రంగేశసేవ తక్క నితర మేమియు నక్కఱ లేదు. అక్కఱ లేదు. రంగరంగరంగా! (లెంపలు వైచుకొనును)

శ్రీని—(తనలో) ఇప్పటివఱ కింక స్వహస్తములతోఁ గొట్టుకొను నదృష్టము పోలేదు.

విప్ర—రంగరంగరంగా! రక్షించు, రక్షించు! చంచలచిత్తమునఁ బందుక్రోఁతిని — కఠినహృదయతను గటికవానిని—రంగరంగ రంగా!

శ్రీని—(తనలో) భాగవతోత్తము మర్యాదకై తిట్టుకొనెడు తిట్టులు క్రమక్రమముగ సార్థకతలోనికి వచ్చుచున్నవి! (ప్రకాశముగ) నేను బందుక్రోఁతి తోఁకచివరనుండు పేను. కటికవానిపృష్ఠము క్రింది కొయ్యదిమ్మను. నారాయణ! నారాయణ!

విప్ర—వ్యర్థుఁడను. అనర్హుఁడను. నిరుపయోగుఁడను. రంగరంగ రంగా! (లెంపలు వైచుకొనును.)

శ్రీని—నేను గరిధూపమను. కుండపెంకును. గబ్బిలపుఁబెంటను. నారాయణ! నారాయణ! ఇదిగో! భక్తురాలు! ఆత్మహత్యమాట పరాకుపడి మా యుబుసులు వినుచున్నది కాఁబోలు! నడు; నడు!

దేవ—నీ వెందులకుఁ గులికెదవు? చచ్చినకంటె నెక్కువపని జరుగక తీఱదు. భాగవతోత్తమా! తమయొద్దకు శుశ్రూషనిమిత్తము నన్నుఁ బంపిన భక్తిసారమునీంద్రుని నేను దర్శించునెడల మీ కా

మహాత్మునితోఁ జెప్పవలసినమాట లేమైన నున్న యెడల జెప్పుఁడు.

శ్రీని—(తనలో) ఆహా! బొందితోఁ బరమపద మేగ నుంటివి! నీ కా మహాత్ముని దర్శనమే! సెబాస్! ఎంతదాన వైతివి. ఏ తెలుకులవానితోడనో! ఏ దూదేకులనాహేబుతోడనో! ఏ కుంభీపాకమునవో, ఏ యినుపగానుగ నడుమనో!—

విప్ర—ఈమె చక్రాంశసంభూతుఁ డగు మహాభక్తవరునిచే నిచటికిఁ బంపఁబడిన దనుమాట మఱచియేపోతిని. ఆహా! గొప్ప ప్రమాదము! ఇప్పు డెట్లు? దీనిని వదలుకొందుమా? పూర్వాచార్యశాసననిరాకరణ మొనర్తుమా? రంగ రంగ రంగా! క్షమింపుము. నిన్ను సంతతము తలఁపకపోవుటయేకాక యీ దుర్మార్గుఁడు నీ భక్తశిఖామణుల మర్యాదలుగూడఁ దీసివైచుచున్నాఁడు. రక్షింపు. రంగ రంగ రంగా! రంగా!

దేవ—బ్రతికియుండి పాపుగడియక్రిందవఱకు బానిసతన మొనర్చితివి గాన నీ భక్తురాలను జేతిమీఁదుగఁ జంపఁదలఁచుటకు సాహ సించితిరి. కాని మీకు మంచిగాని చెడ్డగాని చేయక, మీ జోలికే రాక, చిరకాలముక్రిందట వైకుంఠగతుఁ డగు మహా చార్యపురుషుని మఱల నిట్లేల చంపెదరు? భగవంతుని కార్యము భక్తరక్షణము కాఁగ భాగవతుని కార్యము భక్తమారణమా?

విప్ర—శ్రీనివాసా! నాకీమాటలు వినఁ జైతన్య మెడలుచున్నది? ఈమె యిచ్చటికి వచ్చుటలో రంగదాసోత్తమాజ్ఞయే కాక రంగనియాజ్ఞ కూడను. ఇఁకను దాని నుపేక్షింపఁ దగదు.

శ్రీని—మహాత్మా! తిరిగి యిట్లాడెద రేమి? ఇది యంత దొంగవేస మని నేను మీతో నెన్నిమాఱులు చెప్పియుండ లేదు. మీ కేల జ్ఞప్తిలేదు?

విప్ర—నీవు చెప్పినది నచ్చకపోవుటచేఁ గాబోలు! అయినను దొంగ వేసము వేసిన మోసకత్తె యిచ్చటనే యున్నది కాదా? ఆమె దొంగతన మామెచే నొప్పుకొనఁజేసి పొమ్మను.

శ్రీని—వలదు. వలదు. ప్రాణము విసిగి అదియే పోవును.

విప్ర—అట్లు కాదు. నీకుఁ దెలియదు. నీవు దానిఁగూర్చి యూహిం చినదంత కేవల మూహము. అది సత్య మని చెప్పుటకంటె నసత్యమని చెప్పుటకుఁ గారణము లధికములుగ నున్న ట్లున్నవి. నీ యూహ యసత్యమై, యది భక్తురాలే యగు నెడల మనకు భక్తసంహారణపాపము, భగవద్ద్రోహపాపము, భాగవతాజ్ఞానిరసనమహాపాపము నిశ్చయముగ వచ్చును. బాగుగ నాలోచించుము.

శ్రీని—కాన నామెను బిలువక తప్పదా?

విప్ర—న్యాయముగఁ దప్పించుకొనుటకు దారి కనఁబడదు.

శ్రీని—(తనలో) ఆహా! ఎంత ప్రారబ్ధము సంభవించెను. (ప్రకాశముగ) దేవదేవీ! ఇటు రమ్ము.

దేవ—పో! పో! నన్నుఁ బిలుచుటకు నీ వెవఁడవు?

విప్ర—భక్తురాలా! నేను బిలువు మంటిని. క్షమింపుము.

దేవ—మహాభాగ్యము. ఇదిగో! వచ్చితిని.

విప్ర—నీవు చెప్పఁదలఁచిన దేదియో చెప్పుము.

శ్రీని—దేవదేవీ! ఇచ్చటకు నిన్నుఁ బొమ్మని భార్గవులు స్వప్నమున సాయించి రని నీవు చెప్పినమాట ప్రథమకల్పితము. రంగనిముఖ మప్రసన్నముగ నున్నదని విచారించు గురువులవారిమాటలను నీవు ప్రచ్ఛన్నముగ విని స్వప్నసాక్షాత్కృత శ్రీరంగ రంగ దాజ్ఞా ప్రబంధానల్పకల్పవల్లిని నీవు మఱొకదాని నల్లితివి. నా కవి నమ్మకము లేదు.

దేవ—నీవు నీతండ్రికిఁ బుట్టితి వని నీకు నమ్మక మున్నది కద!

శ్రీని—మహాత్మా! ఎందులకు మీకీ బాధ, నాకీ తిట్లు? ఋజువు కాంద గని యంశము లెట్లు ఋజువుపడఁగలవు? పూర్వపశ్చాదంశ ములఁ బట్టి కొన్ని సత్యము లని గ్రహింపవలయును. అటులే కొన్ని యసత్యములుగ గ్రహింపవలయును. కాని నిదర్శన మెట్లు చూపవచ్చును ?

విప్ర—కొన్ని సత్యములుగఁ గొన్ని యసత్యములుగ గ్రహింపవలయు నని యంటివే? ఇది సత్యముగనే గ్రహింపఁదగిన దేమో ?

దేవ—గ్రహింపఁదగిన యావశ్యకత లేదు. మీ శిష్యుఁ డనిన ట్లన్నియు నసత్యములే. మీకు స్వప్నములు లేవు. తిరుభక్తిసార భగ వానులు లేరు. శ్రీరంగదేవుఁడు లేఁడు. సరియేనా ?

విప్ర—రంగరంగరంగా! రంగ! ఎంత పాపము! (చెంపలు వైచుకొనును.) ఎంత పాపము! మేము నాస్తికుల మగుదుమా ?

శ్రీని—(తనలో) వేశ్యాదాసు లగుటకంటె న ట్లగుటయే మంచిది. అందులో మతము లేకున్న నీతియైన నున్నది.

దేవ—నాస్తికులు మ రెక్కడనో యుందు రనుకొంటిరా? ఇక్కడనే యుందురు. నాస్తికు లనఁగ మ రెవ్వరో యనుకొంటిరా ? వారును నరులే. నాస్తికులకుఁ గొమ్ములు తోఁక లుండు నను కొంటిరా ? వారు మీవంటివారే. నాస్తికత యనఁగ మ రెట్టిదోనా! ఇట్టి చిత్తస్థితియే.

విప్ర—భక్తురాలా! నాకు రంగభక్తియే క్షయించిన దని లోలోపల నుడికి యేడ్చుచున్న నన్ను నాస్తికుఁ డని పిలిచి చంపివేయకుము. నీ చరిత్రస్వచ్ఛతనుగూర్చి యవిశ్వాస మీతనికిఁ గాని, నాకుఁ గాదు. రంగనిపాదములతోడు. నీవు పరిశుద్ధురాల వని—పరమ భక్తురాల వని—నాకుఁ బూర్ణమైన నమ్మకము. కాని నా ప్రారబ్ధమువనో, నాకుఁ దెలియని మఱి యేకారణమువనో కాని నాకు రంగభక్తిలోఁ జలనము కొంత గలుగుచున్నది. మహా భక్తురాల వగు నిన్ను శ్రీరంగమూర్తి నాకంటె నెక్కువగఁ

గటాక్షించుటచే నా కన్నులు తోఁచకున్నదేమో? లేక నే నెఱుఁ గనిదోషముచే నాపై రంగని కాగ్రహము కలిగినదేమో! ఎట్లైన నిప్పుడు భక్తులలో నీకు లోఁగిపోయితిని. రంగ కృపాధికతచే నీవు కృతార్థతను బొందగలవని నా యసూయా రహితమైన యభిప్రాయము.

దేవ__సరే. అయ్యా! శ్రీనివాసా! నాయాగమనముఁగూర్చి నీతోఁ జెప్పిన శ్రీరంగభక్తసారాచార్యప్రసంగ మంతయు నీకు నమ్మకము లేదు. కాన నది యాంతయు నసత్య మనుకొందము. కాని__ఇటు చూడు__నేను నీ కెదుటఁ గనఁబడుచుంటినా!

శ్రీని__కన్ను లింక నున్నవి కాదా!

దేవ__ఇట్టిదుర్భాష లాడిన నీ కది యాశ్చర్యమే__కాని, యది య టుంచుము. నేను నీవలెనే నరకోటిలోదాన నను నమ్మకము నీ కున్నదా?

శ్రీని__ఆ!

దేవ__నే నిక్కడిదానను గాక యెచ్చటినుండియో వచ్చితి నను జ్ఞప్తి నీ కున్నదా?

శ్రీని__సందేహ మేమి?

దేవ__అక్కడ నా కొక యప్ప కొంపయో, సొంతయిల్లో యుండు నని నమ్మఁగలవా?

శ్రీని__కలను.

దేవ__నే నొకతల్లిగర్భమునఁ బుట్టినదాన నని విశ్వసింపఁగలవా?

శ్రీని__ఆ!

దేవ__నాకు సోదరులు, బంధుగులు మొదలగువా రుండిరనునమ్మకమున్నదా?

శ్రీని__అది నా కెట్లు తెలియును?

దేవ__పోనీ! మీరు నాకు సోదరులు కారుగద? బంధువులు కారుగద?

శ్రీని—కాము.

దేవ—నే నిటకు రాకమునుపు నన్ను మీరు, మిమ్ము నేను నెఱిఁగి యుండలేదుకద?

శ్రీని—నిన్ను మే మెఱుఁగము. నీవు మ మ్మెఱుఁగుదువేమో?

దేవ—సరే. నే నెఱుఁగుదును. ఐహికసంబంధముచే మీపై నా కభిమాన ముండఁదగినకారణము లేమైన నున్నవా?

శ్రీని—లేనట్లే.

దేవ—సందేహింతు వేల? ఏకశాఖాసంబంధముగాని, ఏకగ్రామనివాస సంబంధముగాని, సంతతసందర్శనసంబంధము కాని, ఏకమిత్ర గ్రహణసంబంధము గాని, మఱియేసంబంధముగాని మీకు నా కున్నదా?

శ్రీని—లేదు.

దేవ—సరే! మీరు కట్టుకొన్నవి కాషాయలే కద?

శ్రీని—ఔను.

దేవ—నేఁ గట్టుకొన్నది జేగురుపాతకాదా?

శ్రీని—ఆఁ!

దేవ—ఇంతకంటె మంచిబట్ట దొరుక కిది కట్టుకొన లేము కద?

శ్రీని—లేకపోవచ్చును.

దేవ—మీ మెడలోనివి నా మెడలోనివి తులసిపూసలపేరులేనా?

శ్రీని—ఆ!

దేవ—చిన్న మెత్తు బంగారము నాఁడుదానయ్యు మెడఁ గట్టుకొనుటకు దొరకకపోవుటచేఁ గాదుకద?

శ్రీని—కాదు.

దేవ—మీ రేకభుక్తదీక్షులేకద?

శ్రీని—ఔను.

దేవ—నేనో ?

శ్రీని—నీవును.

దేవ—ముష్టి యెత్తుకొనినను కొండవపూటు మెతుకులు దొరుకక పోవుటచేతఁ గాదుగద ?

శ్రీని—కాదు.

దేవ—మీరు బ్రహ్మచర్యవ్రతనిష్ఠులే కదా ?

శ్రీని—దైవకటాక్షముచే నిప్పటివఱకు—

దేవ—నేనో ?

శ్రీని—నీపూర్వపు తగులాటములు మే మెట్లు గని పెట్టఁగలము?

దేవ—నే నిచ్చటకు వచ్చినతరువాతనైన నాబ్రహ్మచర్యవ్రతదీక్షలో భంగ మేమైన మీరు గాంచితిరా ?

శ్రీని—లేదు.

దేవ—నేను యౌవనవతి నైనట్లు నీకుఁ గనఁబడుటలేదా ?

శ్రీని—నే నది యెట్లు చెప్పఁగలను ? పొంగలి గంగాలమువలె నున్నావు.

దేవ—సరే. నేను సురూపను గానట్లు నీకుఁ గనఁబడుచుంటినా ?

శ్రీని—సురూపలను జూచి యేడ్చితినా యేమి ?

దేవ—పోనీ! నే నింద్రియలోలత గలదాన నైనయెడల నాకుఁ దగిన మగని నెవనినో చూచుకొనఁగలనా ?

శ్రీని—వైష్ణవాలయ మున్నచోట మగలకు మాలకాకులకు లోటేమి?

దేవ—నేను మన గురువుగారికి సర్వోపచారములను జేయుచుంటినా ?

శ్రీని—అందులకు గురువులే సాక్షులు.

దేవ—తుచ్ఛమైన యీ శరీరమును బోషించుకొనుటకే నే నీ దాసిసతనమున కొప్పుకొంటినా ?

విప్ర—రంగరంగరంగా ! ఎంతమాట !

దేవ—శ్రీనివాసా ! నీవు మాటలాడ వేమి ?

శ్రీని—గురువుగారు ప్రత్యుత్తరమును సాయించిరికాదా ?

దేవ—ఊరప్పుకొనుటకు మా గ్రామమున నిండ్లు లేవా ? తోముకొనుట కంట్లు లేవా ? పట్టుకొనుటకుఁ గాళులే దొరకవా ? సేవించుటకు నరులే దొరకరా ? ఇట్టి నీచత కొడఁబడి పరమనీచమైన యీ దేహమునే పోషించుకొనఁదలఁచినయెడల నింతకంటె సుఖకరమగు సేవావృత్తి మఱియొకచోట లభింపఁగలదు కద !

విప్ర—రంగ! రంగ! ఒకనికి దాస్య మొనర్చినదనుక నీ కేమి ?

దేవ—శరీరపోషణమునకుఁ గాక—శరీరముకంటె భిన్నమైన యాత్మ తత్త్వమును బోధించుకొనుటకు మన గురువులవారికి నీ వలెనే యిల్లు వదలి వనముఁ జేరి కాషాయధారణముఁ జేసి బ్రహ్మచర్యవ్రత మొనర్చి యిహకేతరానందముకొఱకు నీ కంటె నెక్కువసేవఁ జేసితి నని స్పష్టపడుచున్నదా ?

విప్ర—రంగరంగరంగా! చెప్పవలసిన దేమి ?

దేవ—శ్రీనివాసా! నీవు రెండుమాటలనుండి యామోదించుట లేదేమి?

శ్రీని—గురువులవారి యామోదములు హెచ్చగుటచే నానోరు పడి పోయినది.

దేవ—శరీరభిన్నమైన తత్త్వ మాత్మయే కద ?

శ్రీని—ఆ !

దేవ—ఆత్మను సుప్రసన్నముగ, పరిశుద్ధముగ, శేషగుణ సంపన్నముగ, గురుజనానురాగ యుక్తముగఁ జేసికొనువాఁ డెవఁడు ?

విప్ర—రంగరంగరంగా! వాఁడేకదా భక్తుఁడు !

దేవ—అట్టిచో నీవు భక్తుఁడవు ? నేను దొంగనా ?

విప్ర—రంగరంగరంగా ! ఎంతమాట !

దేవ—అట్టి భక్తుఁడు స్త్రీ యైనప్పుడు దాని నేమందురు ?

శ్రీని—భక్తునిభార్య యందురు.

విప్ర—ఆమె యట్లు సహేతుకముగ మాటలాడుచుండ నీవు పరిహాసిం చుట తగునా ?

శ్రీని—ఈమె చెప్పిన దంతయు నసత్యమని నాకు లోన బ్రబలముగ దోచుచున్నప్పటికి నీమెకు దగిన ప్రత్యుత్తర మీయలేని యశక్తివలన గలిగిన దుర్జనత్వమును బుట్టిన కోపమును వెల్లడించితినిగాని యీమెను బరిహాసింతునా !

దేవ—మహాత్మా! వింటిరా? కార్యకారణభావ మంతయు నీతడ యొప్పుకొనినాడు. కాని పర్యవసానమునుగూర్చి సమ్మతించడు ! దీనిపేరు తలతిక్కకాదా ? దీనిపేరు నాస్తికత గాదా ?

విప్ర—అతనిజోలి నీ కెందులకు ? నీవు మహాభక్తురాల వని నాకు సంపూర్ణవిశ్వాస మున్నది.

దేవ—భక్తురాలికి బహుమానము పరిత్యాగమా ? ఈతడుకూడ భక్తుడేకదా? భక్తియే పొమ్మనుటకు గారణమగు నెడల నీతని నేల పొమ్మనలేదు.

శ్రీని—అననివేళ దాటెనదా ? మీ రిద్దఱొకటియే యగుదురు. నన్నే వేఱుచేయుదురు.

విప్ర—నిన్నేల పొమ్మంటినో కారణము చెప్పెదను వినుము. నీవు భక్తురాలవు. నీవలన నెంతమాత్రమును లోపములేదు. కాని నీ విటకు వచ్చిన రెండుమూడుమాసములనుండి నా కేమో కాని యొకవిచిత్రమైన...

శ్రీని—(అపవారించి) ఆమాట చెప్పకొందు రేమయ్యా ! అది గృహచ్ఛిద్రమయ్యా ! ఆత్మదోష మయ్యా ! అది చలితేంద్రియత యయ్యా ! అందుచేతనే భక్తిచ్యుతి యయ్యా ! (నోరు మూసికొని) దాచదగినది వెల్లడించుకొందు రటయ్యా !

విప్ర—నాకు రహస్యము లేదు. నామన సాకాశమువలె నందఱికి బట్ట బయలు కాదగినదే. అది నాదోషమే యగునెడల నిర్భీతిగ నొప్పుకొనెదను. దోషమును నిష్కపటముగ నొప్పుకొనుటయే

దోషప్రాయశ్చిత్తము. హృదయమున నున్నదోషమును వెళ్లఁ డించుకొనక లోననే దాఁచుకొన్నయెడల వ్యాధివలె వృద్ధినొ నశింపఁజేయదా ? భర్తృరాలా ! అనిర్వచనీయమైనయొకమనస్థితి నీదర్శనమున నాకుఁ గలిగి వృద్ధియగుచున్నది. అది యవాఙ్మ నసగోచరమగుసుఖము నిచ్చుచునేయున్నది, కాని—చూడుము ! ఏమార్గము ననుసరించి తరింపఁదలచితినో యామార్గమునుండి యిట్టి యిట్టి తప్పి—మఱల పడి—మఱల తప్పి—క్రమక్రమ ముగఁ దత్పథమునకు దూరముగఁ బోవుచుంటినో లేక యిఁకఁ బోదునో యనుభీతిచేత—

దేవ—శ్రీనివాసా ! ఛీ ! ఛీ ! ఛీ ! కుక్క అదిగో ! తిర్వారాధనపుమడి సంచిని ముట్టుకొనినది.

విప్ర—అయ్యయ్యో ! పొమ్ము ! పొమ్ము !—

శ్రీని—(తనలో) కుక్క సాలగ్రామసంపుటము నైదుమాసముల క్రింద టనే స్పృశించినది. ఇఁకను నోటఁ గఱచుకొనిపోవుటయే తరు వాయి ! ఛీ! ఛీ! ఛీ! (లోనికిఁ బోవును)

దేవ—(విప్రనారాయణుని రెండుచేతులు గట్టిగఁ బట్టికొని) మహాత్మా! నన్ను వదలకుఁడు. నేను మిమ్ము వదలను.

విప్ర—అయ్యయ్యో! రంగరంగరంగా ! నాచేతులను వదలుము. లోపల నేదియో యాపాదశిరఃపర్యంతము జల జల లాడుచున్నది, ఒడలు పులకిత మగుచున్నది. రంగరంగరంగా ! నన్ను వదలుము. నే నిదివఱకు నీతోఁ జెప్పుకొనినవికార మిదియే. ఇది నీవలననే కలిగినది కాన నీవు దూరముగ నుండి నను క్షమింపుము.

దేవ—నావలన లోప మేమైన నున్నదా ? నాయొడలు పులకితమైనదో లేదో చూడుఁడు. (ఆతనిచేతితోఁ దన్ను స్పృశింపఁజేయును.)

విప్ర—రంగరంగరంగా ! నీవలన నెంతమాత్రమును లోపములేదు. నీకు నావంటిమనస్థితి లేదు. నాప్రారబ్ధమున నాకుఁ గలుగుచున్నది.

దేవ—లోపము మీదైయుండ శిక్ష నా కేల ?

విప్ర—రంగరంగరంగా! రంగ! నా కేమియుఁ దెలియకున్నది.

దేవ—ఇంద్రియనిగ్రహమున నాశక్తినిగూర్చి నన్నెఱిఁగినంతవఱ కందఱెఱుఁగుదురు. నేను మిమ్ముల నాశ్రయించుటకు వచ్చితినని లోకమంతయు వెల్లడియైనది. ఇప్పుడు మీరు నన్ను వదలుకొనఁగనే భక్తుఁడగు విప్రనారాయణుఁడు దేవదేవిని జూచి పండ్లిగిలింపబోవ దేవదేవి యాతని నిరాకరించి, తిరస్కరించి, వెడలిపోయిన దని మీకుఁ గలుగఁదలఁచినయప్రతిష్ఠ నేను గాచు కదా? లోకమైన సహింపలేదు. నామూలమున నట్టిదుర్వాక్యము ప్రబలుటకంటె నే నిప్పు డిక్కడనే ప్రాణత్యాగ మొనర్చుట మంచిది. నేను సర్వసిద్ధముగ నున్నాను.

విప్ర—అయ్యయ్యో! ప్రాణత్యాగ మేల?

దేవ—అటు లంటిరి కాన మీ వనములో నే నుండెదను. మీకుఁ దఱచుగఁ గనబడను. చెట్లచాటునఁగాని శ్రీనివాసునిచాటునఁగాని కూరుచుండెదను. నేను లేనట్టే మీరు భావింపవచ్చును. మీయాత్మను రక్షించుకొనుఁడు. నా యాత్మను గాపాడుఁడు.

విప్ర—నీవు తఱచుగ నాకుఁ గనబడకపోవుటచేత నిట్టి మనస్స్థితి క్రమముగ నశించు నని నీ యభిప్రాయమా?

దేవ—నశింపనే నశించును. నశింపక వృద్ధియగునెడల నటు పైఁ జూచుకొనవచ్చును.

విప్ర—వృద్ధి యగుటయే! రంగభక్తిచే నిర్మూలన మొనర్తునుగాని—

దేవ—చిత్తము. మఱింత మంచిది.

విప్ర—నాచేతు లింక విడువుము.

దేవ—(తనలో) ఇప్పటి కింతతో సరిపెట్టెదను. (విడుచును)

విప్ర—నీవు తులసికోటచాటున కింకఁ బొమ్ము.

దేవ—చిత్తము. (పోవును.)

విప్ర—రంగరంగరంగా! (లెంపలు వైచుకొనును.)

చేన—(తనలో) తెంపలు కొట్టుకొన్న సరే, ఇంకఁ దల నేలను వ్రచి మోదుకొనిన సరే, గొంతుకవఱకుఁ బూడ్పించుకొని గోతిలోఁ గూరుచుండినసరే, కాళ్ళపైఁ దలక్రిందుగ వ్రేలాడినసరే! రంగభక్తి జబ్బున జాఱిపోక మానదు. దేహమునఁ బ్రవేశించిన విషము జరజర తల కెక్కక మానదు.

విప్ర—రంగరంగరంగా! రంగ!

గీ॥ కష్టదశ వచ్చెనయ్యా! రంగయ్యా! నాకు
నిశ్చలంబుగ నీభక్తి నిలువ దయ్యా!
నాదుప్రారబ్ధ మేమొ రంగా! శుభాంగ!
యెట్లు నిలువఁబెట్టెదో నన్ను నింకమీఁద.

ఆ॥ వె॥ బుద్ధి దొంగగొడ్డు పోలిక నట్టిట్లు
పరుగు లిడును దుష్ఫలముఁ గోరి
దాని మెడను గుదియఁ దగిలించి నీయెట్ట
యెదుటఁ గట్టిపెట్టు మింక రంగ!

చేన—(తనలో) దొంగగొడ్డునకు గుదియ వైచినంతమాత్రమునఁ బరుగు లుడుగవు. అంతకంటె దొంగదగు మఱియొక గొడ్డుతో లంకె వేయవలయును. అదియుఁగూడ సిద్ధముగనే యున్నది కాదా!

విప్ర—శ్రీనివాసుఁడు లోనికిఁ బోయి యింకను రాకున్నాఁడు — ఇది యేమి? నిశ్చలభక్తితో రంగని దలఁచుచుండఁగ నింతలో శ్రీనివాసుఁ డేల స్మృతికి రావలయును? (ఆలోచనము నటించుచు) అదిగో! దొంగగొడ్డు—పాఱిపోవుట— యనుమాటలు, కుక్క—మడిసంచి— తగులుట— పాఱిపోవుట— యనుసంశయములు జ్ఞప్తికిఁ దేఁగ నందుపైఁ గుక్కను గొట్టఁబోయిన శ్రీనివాసుఁడు స్మృతికి వచ్చినాఁడు. భక్తినిశ్చలత్వమునకు ఖరి యిట్లున్నది. రంగ రంగరంగా! ఏమి చేయుదును? నాబ్రదు కింక నధోగతియేనా? అయ్యయ్యో! రంగా! రంగ! నీపవిత్రనామమును నోట స్మరించుచుండ మనసులో దొంగకుక్క సంచరించుచున్నది. ఇట్ల

పరమపాపిష్ఠుఁడ నైన నేను నిన్నిఁక స్మరించిన వినియోగ మే మున్నది? మీఁదుమిక్కిలి పాపముకూడ నేమో! అయ్యయ్యో! రంగ! రంగరంగా! (తలఁ గొట్టుకొనును.)

దేవ—(తనలో) నీవు నెత్తిపైన నీ చేతులతోఁ గొట్టుకొనిన రసము లేదు. నేను ముందు నాట్యము సేయుచుండ, మాయక్క వెనుక తాళపుహంగు సేయ, నీవు వెనుకఁ దిత్తి నూఁదుచుఁ గుక్కపాటులు పడి యూఁద మానివేయ, నప్పు డెడమచేతి తాళపుజిప్పతో మాయక్క నీ నెత్తిపై టంగున బ్రహ్మరంధ్రస్థానముఁ గొట్టినప్పుడు—అది రసము కనుకదెబ్బ! ఆదెబ్బతో గిరగిరఁ దిరిగి తలప్రాణము తోఁకకు వచ్చినప్పుడు రంగభక్తి తిరుగఁ గుదురవలయునుగాని యిప్పుడు నిప్పులలోఁ బడి దొరలినఁగాని వినియోగము లేదు.

విప్ర—రంగరంగరంగా! రంగ! నాబుద్ధి నిశ్చలముగ నుంచవా! (కొంత బాగుగ సవరించుకొనుచున్నాఁడు) రంగా! (కేక వేయును) గొంతేమో మోటుగను జీరగలిగినట్లును వచ్చుచున్న దెందుచేతనో? ఆహా! మృదులనాదము చెప్పవచ్చినప్పుడు దేవదేవిదే. అది రంగనామము స్మరింప నాయొడలు జలజలమని యమితా నంద మిచ్చుచుండెను. దానిని నాప్రక్క నుంచుకొని దానిచే రంగనామమును స్మరింపఁజేయుచు నేను సుఖముగ వినుచుండిన యెడల నేను స్మరించుటకంటె నెక్కువఫలప్రద మేమో యను కొందును. కాని ఇది యొక ప్రారబ్ధము సంభవించెను. అది నా కంటఁ బడుటకు వీలు లేదు. ఆ సమయమున నేను గన్నులుమూసి కొని వినువెడల నదియు కనఁబడదు. చిత్తమునకుఁ జక్షువుల గుండ బాహ్యప్రవర్తనము లేకుంటచే మఱింత నిశ్చలత గుదుర వచ్చును. చూడు! దేవదేవీ! అక్కడనే యుంటివికాదా?

దేవ—(ఎదుటికి వచ్చి నిలువఁబడి) ఏమి సెలవు?

విప్ర—(కన్నులకుఁ జేయి యడ్డము పెట్టుకొని) నిన్ను నాయెదుటికి రమ్మంటినా?

దేవ—"ముందు దేవదేవి!" యని మీ రంటిరి కాదా? ఎదుటికి రాకుండ నెట్లు చూడఁగలను?

విప్ర—(ఒక్కసారి దానివంకఁ జూచి) సరే.—సరే! నీవు పోయి చాటుననే యింకఁ గూరుచుండుము.

దేవ—(తనలో) ఇప్పుడు నావంక నీతఁడు చూచినచూపు వెఱ్ఱిచూపే! ఏమియు సందేహము లేదు. ఇట్టిచూపు చూడఁగ నీతని నెన్నఁడును జూచియుండలేదు. ఫలములు పూర్ణముగఁ బడని యర్భకపు బిళ్ళలోవలె నీతనికంటిచూపులో నొక చిత్రమైనవెలుఁగు, కొలఁదిపాటిరక్తియు, గానఁబడినవి. అయ్యవారులగారిభక్తికింక నాశ్వాసాంతమే!

—"ఉష్" అనుసరికి పాపము! పిలిచితి నేమో యని పరుగున వచ్చెను. ఏమి గురుభక్తి! ఏమి యాజ్ఞావిధేయత! ఏమి గురూపచారాభిలాషోత్కృష్టత! శ్రీనివాసుఁడుకూడ మంచివాఁడే అతఁడుగూడ నాసుఖమును జూచువాఁడే కాని, ఏమున్న నేమి? పురుషోపచారములకొఱ కేర్పరుపఁబడు స్త్రీ యొసఁగిన సుఖమునా? కాని, అతనికి నీనికిఁ బెద్దవైరము గన్నది. నా ప్రారబ్ధఫలములలో నీ గృహకలహ మొకటి. చెప్పినట్లు శ్రీనివాసుఁడు వినఁడు. దీనితోఁ జెప్పుటకే మనసొప్పదు. శ్రీనివాసుఁ డిదిగో వచ్చుచున్నాఁడు.

(శ్రీనివాసుఁడు ప్రవేశించును.)

విప్ర—ఏమైనది?

శ్రీని—అంతయు ధ్వంసమైనది.

విప్ర—తిరిగి యింకఁ బనికిరాకుండఁగనే?

శ్రీని—సంచిని నోటఁ గఱచుకొనిపోవ నే నడ్డుదగిలితిని. దాని నింట నుంచి స్నానము చేసి వచ్చితిని. స్నాన మొనర్చిఁగాని తాఁకఁ

దగనిపవిత్రవస్తువును దాఁకి స్నానముచేయవలసిన దుర్గతి యెట్లు పట్టినదో? మహాత్మా! దేవదేవి యేది?

విప్ర—దానిమాట కేమిగాని ముం దీమాట చెప్పుము. అయ్యయ్యో! ఎన్ని సాలగ్రామసంపుటములు! ఎంత దేవతార్చనార్హసామగ్రి! ఇది యంతయుఁ దిరిగి పరిశుద్ధి యింతట నగునా?

శ్రీని—దానిమాట కేమి? అది చెడినమాత్ర మేమి? నిముసములో బాగు చేయవచ్చును. పులికాపో, తిరుమంజనమో, నాళ్గోదమో యేదో యేడిచి నేను బాగుచేసెదను. దేవదేవిమాట యేమో ముందు చెప్పుఁడు. ఇది పోయినఁగాని మనకు గతులు నిలువవు. భగ్నిష్టల మైనతరువాత మాత్రము మంల గడ్డిమసితోఁ దోమిన సరే, తడిపిన సరే, అరగఁదీసిన సరే, సాగఁదీసిన సరే, చంపిన సరే, తగులఁబెట్టినసరే కాని మడిసంచివలెమాత్రము మఱల పవిత్రము గాలేము.

విప్ర—నిమ్మళము! అది యీ చాటుననే యున్నది.

శ్రీని—అయ్యయ్యో! పోయినది కాఁబోలు నని సంతసించితినే! ఎంత ప్రారబ్ధమయ్యా! ఎందుల కుంచితిరి?

విప్ర—మ తేమియుఁ దొందరలేదు. కారణ మేదో సావకాశముగఁ జెప్పెదను. నాతో లోనికి రమ్ము. చూడు! అక్కడ దేవదేవి యున్నది. దానిని నేను జూడను. తాన ముందు దానిని జట్టునఁ బొమ్మని చెప్పుము.

శ్రీని—మన కీ స్త్రీవిద్యోపాసన మెందుల కయ్యా? దేవదేవీ! ముందు నీవు పొమ్ము. (దేవదేవి పోవుచున్నది)

శ్రీని—మహాత్మా! గడియగడియకుఁ గ్రిందిక్రిందికి జారుచున్నారు. మీ మహాత్మ్యమునకు నాతరము గాకున్నది. మహాత్మా! మీరే కొంత పూర్వచింత చేసికొని మనసు గుదుటఁ బఱచుకొనినఁ గాని యెంతమాత్రమును వినియోగము లేదు. మహాపత్తు రానై యున్నది. మిమ్ముఁ గాపాడుకొనుఁడు. నన్ను రక్షింపుఁడు!

విప్ర—వెఱ్ఱివాఁడా! నే నంత చపలుఁడ నగుదు ననుకొంటివా? తొందర యేమియు లేదు. లోనికిఁ బోవలయును. చూడు! దేవదేవి వెళ్ళిన దేమో?

శ్రీని—అప్పుడే వెళ్ళినది.

విప్ర—ఆఁ! కాలిచప్పుడైన వినఁబడకుండ నెట్లు పోయినది?

శ్రీని—అది కనఁబడకపోయినను గాలిచప్పుడైన వినఁబడినదికాదుగదా యని విలపించుచుంటిరా? ఆహా! ఈ దిక్కుమాలినతలుపు చాటుతారుటలు, సందుగొందుల నిక్కిచూచుటలు మొదలైన ఘోషకూడ నేదులకు?

విప్ర—ఇటులా నీవు నన్ను గ్రహించితివి? కాని నియమ మెంత పట్టుదలతో జరుపుకొనుచున్నదో యని నేను సంతసించుచుంటిని.

శ్రీని—ఆ పట్టుదలలోఁ బదునాల్గవవంతయిన మీకు లేకపోయెనే యని నే నేడ్చుచుంటిని.

విప్ర—తొందర లేదు. మడిసంచి బాగుచేసికొని మజల నిప్పుడే యిక్కడకు వత్తము రమ్ము.

శ్రీని—మనసు బాగుచేసికొనుట యంతకంటె ముఖ్యమైన పని.

విప్ర—సరే! మజల వచ్చి చూచుకొనవచ్చును. రమ్ము.

(ఇద్దఱును నిష్క్రమింతురు)

ఇది తృతీయాంకము.



శ్రీ

# విప్రనారాయణ చరిత్రము

## చతుర్థాంకము

ప్రదేశము—విప్రనారాయణుని పుష్పారామము.

(ప్రవేశము—విప్రనారాయణుఁడు.)

విప్ర—గీ॥ నోరు రంగరంగా! యనఁ ♦ జోరబుద్ధి
యందు నా దేవదేవి య♦ల్లాడుచుండుఁ
గన్నులను మూసి రంగని ♦ గాంచఁబోవఁ
దొయ్యలియె నవ్వుచు నెదుటఁ ♦ దోఁచుచుండు.

గీ॥ దానిపై బుద్ధి మానఁగఁ ♦ దలఁపడినకొ
లంది తద్యోజనమె ప్రబ♦లముగ నయ్యె
మఱవఁ దలఁచినయంశంబు ♦ మఱవఁబూను
కొలఁది స్మృతిలోన బిగ్గఁ దా♦ర్కొనినయట్లు.

గీ॥ చిత్తమందు వేశ్యారక్తి ♦ చేరుకొలఁది
రంగభక్తి దూరం బయ్యె ♦ రసము కచిక
పీల్చినకొలంది తన్మధ్య♦విలసితమగు
వాయుమూర్తి యెగసి పోవు ♦ వైఖరిగను.

గీ॥ దివ్యముగఁ బూర్ణముగ రంగ♦దేవుఁ డిచ్చు
నాస్యసేవ ముత్ప్రదము; కా♦దనఁగఁ దప్పు
(లెంపలు వైచుకొనును.)
కాని పూలమాటున నింత ♦ గానఁబఱచు
తిరుమొగముసేవ ముద మెంతో ♦ తెలియఁదరమె?

గీ॥ ఎప్పుడు కనఁబడ దొకవేళ ♦ నెదుటఁ బడఁగ
వలయునప్పుడైన మాసిన ♦ పైఁటచెఱఁగు
మాటునఁ దళుక్కు మని మెల్ల ♦ మాయ మగును
జలదగతశతక్రతుధనుః ♦ కలికవలెను.

(దేవదేవి ప్రవేశించును.)

దేవ——ఈతఁ డేదో పైకి ననుకొనుచున్నాఁడు. ఇచ్చటనుండి విందును.

విప్ర——ఈదిన మిచ్చట నేదో యొకచిన్న పురాణకాలక్షేపమును నన్నుఁ జేయుమని శ్రీనివాసుఁ డూరక బలవంతపెట్టు చున్నాఁడు. కాలక్షేపకర్తను గాలక్షేపప్రియుఁడ నగునాకు భక్తిరహితముగనే కాని కాలక్షేపము గాకయున్నది. పూర్వాచార్యప్రసాదితగ్రంథములలో దేనినైనఁ జదివినయెడల నాకుఁ దిరిగి మనసు కుదుటపడునేమో యని శ్రీనివాసుఁడు దేవులాడుచున్నాఁడు కాఁబోలు !

గీ॥ చదివినంగాని చిత్తంబు ♦ కుదుటఁబడదు
హృది కుదుటఁ బడకుండఁగఁ ♦ జదువు టెట్లు?
పెండ్లి కాకుండఁగ మదపుఁ ♦ బిచ్చి పోదు
పిచ్చి కుదురకయుండినఁ ♦ బెండ్లి కాదు.

ఏమి సేయవచ్చును.

దేవ——(తనలో) ఇట్టిసంధిని వారకాంత నుంచుకొనుటకంటెఁ దారక మార్గము మఱియొకటిలేదు. (తులసికోటచాటునఁగూరుచుండును.)

విప్ర——ఆహా! శ్రీనివాసుఁ డింక నేదో పూర్వాచార్యకృతగ్రంథ మొక్కటి దెచ్చి చదువుమని చెప్పును గాఁబోలు! శిష్యుఁడు గురునికిఁ జదువు మంచి దని బోధించుట గురువు చదువుకొన కుండ మూల్గుట! ఇట్టిరీతిగా నాబ్రదుకున్నది! (శ్రీనివాసుఁడు ప్రవేశించును.)

శ్రీని——స్వామీ! వచ్చితిని. నామనవిని మన్నింపవలయును.

విప్ర—దేవదేవి యింక రాలేదేమి ?

శ్రీని—(తనలో) ఈతని కెంతసేపును దృష్టి దానిపైననే నిల్చియున్నది. (ప్రకాశముగ) స్వామీ! పురాణశ్రవణమును నే నపేక్షించి యుండఁగ దేవదేవీదర్శనమును మీరు వాంఛించుచుంటిరా !

విప్ర—పాపము! అదిమాత్రము వినవలదా ? ఉన్నవా రిద్దఱు శిష్యులు. వారిలో నొకఁడు వచ్చి యొక్కతె రాకుండునెడల నాకుఁ గాలక్షేప మెట్లు జరుగఁ గలదు? కావున దానిని గూడఁ బిలువుము.

శ్రీని—ఇదిగో! వెళ్ళివచ్చెదను.

విప్ర—అక్కఱలేదు. ఇక్కడనుండియే బిగ్గఱగఁ బిలువుము.

శ్రీని—దేవదేవీ! దేవదేవీ!

దేవ—(ఎదుటఁ బడుచున్నది)

శ్రీని—అయ్యయ్యో ! ప్రమాదము! స్వామీ! ఈవిసరుకఱ్ఱను మీ మొగమున కడ్డముగ నుంచుకొనుఁడు. (ఇచ్చును) దేవదేవీ! నీ విచ్చుటకు వచ్చి యెంతసే పైనది !

దేవ—నీవు రాకముందే వచ్చినాను.

శ్రీని—నీవు రాలేదని యింతసేపు గురువుగారు నాతో ముచ్చటించు చుండఁగ వినియుండియు వచ్చితి నని చెప్పలేకపోయితివా ?

దేవ—చెప్పినయెడల నీతోఁ బ్రసంగింపనిదే యేల యుత్తర మిచ్చితి వని నీ వధిక్షేపింతువేమో ? అదిగాక నాకుఁ గునికిపాట్లు కూడ వచ్చిన ట్లున్నది.

విప్ర—అసురసంధ్యవేళఁ గునికిపాట్లేమి ? దేహములో నేమైన నారోగ్యలోపముగ నున్నదా యేమి ?

శ్రీని—ముందు జరుగఁబోవు పురాణ మీయఁదగిన ఫల మిప్పుడే యావేశించినదా ?

విప్ర—మాటలాడవేమి ? ఏమైన జబ్బుగా నున్నదా?

దేవ—ఉన్నయెడల నెవనితోఁ జెప్పుకొనను ?

శ్రీని——వైద్యునితో——

విప్ర——అదేమి మాట? దేవదేవి! నీవు మాకు సకలోపచారములు చేయుచుండ నీ క్షేమముమాత్రము మే మరయ నక్కఱలేదా? మే మంత యవిశ్వాసముగ వర్తింతుమా?

శ్రీని——అయ్యో! విసరుకఱ్ఱ జారిపోవుచున్నది. కొంచెము పైకుంచు కొనుండు.

విప్ర——(తనలో) విసరుకఱ్ఱకా దోయి! మనసు.

దేవ——మ ఱేమియుఁ దొందరలేదు. కాలక్షేపమును గానిండు.

శ్రీని——స్వామీ! ఇదిగో కోశము! (విప్పుచున్నాఁడు) అయ్యో! తిరువధ్యయనమంత్రములకట్ట పట్టుకొని వచ్చితిని. పోయి యాచార్యగ్రంథములఁ దెచ్చెదను. (పోవును)

విప్ర——(తనలో) తద్దినపుమంత్రములా? అయిన నేమి? నా భక్తి కింకఁ జరమకైంకర్యమే కావున శ్రాద్ధమంత్రమైన సమయోచితముగనే యున్నది. (ప్రకాశముగ) ఈ దిక్కుమాలిన విసఱుకఱ్ఱతోఁ బ్రయోజన మేమి? (పాఱవైచి) దేవదేవి! నీ దేహములోని బాధ యేదో చెప్పెదవా లేదా?

దేవ——చెప్పెదవా లేదా యని యడిగితిరి. చెప్పవలయు నసియే యున్నది. చెప్పలేకుండ నున్నాను.

విప్ర——ఏమి? సిగ్గుపడుచుంటివా?

దేవ——మహాత్మా! సిగ్గు విడిచిపెట్టి యెంతకాలమైనది? సిగ్గు గలిగి యుండినయెడల నింత సాహస మొనర్చి యిల్లును బంధువులను సంపదను వదలి యొక్కతెనై పురుషు నాశ్రయింప నింత దూరము వచ్చియుందునా? అప్పు డున్న భక్తితీవ్రతచే నాకు స్త్రీత్వము, సిగ్గు, భయము కూడఁ గనఁబడలేదు. నన్నుఁ బ్రాపంచికసమస్తసంబంధదూరముగఁ జేసిన యా భక్తి యిప్పుడు నిలువరాదా? నా మహాకర్మము!

విప్ర—నీభక్తి నిశ్చలముగనే యుండెను గాదా!

దేవ—ఉండెను. ఎప్పుడో!

విప్ర—ఇప్పుడో!

దేవ—పోనిండు. మీ కేమిలకు? నా ప్రారబ్ధ మెట్లున్నదో యట్లే జరుగును. మీ కేమి! హృదయపటుత్వము గల పురుషులు. రంగభక్తి జాతి రక్తి హృదయమం దెక్కుచున్నను బలవంతముగఁ ద్రోసివైచుచుందురు. మనసు వెంటనే త్రిప్పుకొని తిరిగి భక్తిలోఁ బడి గానమో కాలక్షేపమో చేయుచు భక్తిని స్థిరపఱుచుకొందురు.

విప్ర—దేవదేవీ! ఏమి? నీకుఁగూడ నాకు వచ్చినస్థితివంటిదే వచ్చినదా యేమి?

దేవ—అట్టిదే యైన యెడల నింతబాధ యేమి? నెత్తిపైకి సూర్యుఁడు వచ్చినప్పు డక్కడకు వచ్చి యిప్పటివఱకు నే నేడ్చినయేడుపేమి చెప్పఁగలను? అబలను. అందఱిని వదలి యిచ్చటకు వచ్చినదానను. అందులోఁ గేవల మమాయికను. అదిగాక నాదుర్గతిచే నమితానురాగపూర్ణహృదయను—

విప్ర—నిజమే. అనురాగాధిక్య మున్న హృదయమందే కాని భక్తి నిలువదు.

దేవ—నిలిచిన దేదీ? తల్లికి సోదరులకు శత్రువునైతిని. ఊరివారికెల్ల లకుఁ బాత్రమనైతిని. సర్వము మీరే యని మీపాదములఁ బడితిని. నాపుణ్యవశమున భక్తి ప్రబలుచున్న దని పొంగి పోయితిని. ఇంతలో నిట్లు బోరలఁబడుదు నని యెఱుఁగక పోయితిని. హా! స్వామీ! నా కింక నేది గతి?

విప్ర—నీ కిప్పుడు కలిగిన మనోవికారము నావలననే కలిగిన దని నీకు నమ్మకమా?

దేవ—అయ్యో! స్వామీ! భక్తి భగ్నమై పోవుటచేఁ గాఁబోలు! సిగ్గు తిఱిగి నన్నావహించు చున్నది. ఈ మనోవికార మెట్టిదో

యిది యెందులకుఁ గలిగెనో నేనుమాత్ర మెఱుఁగుదునా ? పెద్దదాననై నది మొద లిప్పటివఱకు సన్యాసమ్మవలెనే కాల క్షేపము చేసితినిగాని యూఁడుదానిముద్దుముచ్చట లెన్నఁడైన నెఱుఁగుదునా ? అయ్యయ్యో ! నాయీడువారలు పట్టుబట్ట లని — కోసుల పేరు లని — కాటుక రేఖ లని — చందనపుఁబూఁ తలని, — యత్తరువు లని — ముద్దుముద్దుగ మగ లని — ముద్దు లని — కౌఁగిలింత లని — యెడలు తెలియని మహానందముల తోఁ జిలుకగోరువంకవలెఁ గిచకిచలాడుచు, గలకలలాడుచు, గుబగుబలాడుచు, మురియుచుఁ, గులుకుచుండ —

విప్ర — అబ్బ ! ఒడలు పులకాంకిత మగుచున్నది !

దేవ — నాప్రారబ్ధము ! నాకుఁ దులసిపూసల పేరులు ! జేగురుపాంతెలు! తల నల్లుకొనిన జడలు ! ఏకభుక్తులు ! బ్రహ్మచారిణీవ్రతములు ! దాసరమ్మవేసములు ! అధశ్శయనములు ! పరదేశగమనములు ! బానిసతనములు! — ఇంతే కాదా ! ఇన్నిఁటికిని బ్రధానమైన యారంగభక్తిగమైన నిలువఁబడ నాయంతది లేనేలే దని సంతో షించియే యుందును. అట్లు కాక —

విప్ర — అట్లుగాక — ఇప్పుడు క్రొత్తగాఁగలిగిన చిత్తస్థితిని నిర్వర్ణింపలేవా ?

దేవ — పురుషులు, ప్రాజ్ఞులు, విద్వాంసు లయిన మీరే యశక్తులై యుండినప్పుడు స్త్రీని, నప్రాజ్ఞను, ప్రపంచసుఖానుభవ మెట్టిదో కూడ నెఱుఁగని పెద్దమ్మను, నే నెట్లు నిర్వర్ణింపఁగలను ? మొట్టమొదట నిది యేమో కొంచెము స్థిమితత లేకపోవుట యని, తోఁచకపోవుట యని, యేదో యొకవిధమైన బెంగ యని యనుకొంటినిగాని —

విప్ర — సరిగా నట్లేనుమా నాకుఁగూడ ప్రారంభమైనది!

దేవ — ఆరంభించుట మీ మనస్స్థితివలెనే ప్రారంభమై వృద్ధియగు టలో మీ యవస్థకంటె మఱింత శీఘ్రముగను దృఢముగను బెరిగినది —

విప్ర—ఆండుదాన వగుటచేఁ గాంబోలు !

దేవ—అందులోను శుద్ధసత్త్వకాలపు వెఱ్ఱిగోలను.

విప్ర—నిశ్చయమే. చూడు ! మనస్సు నిశ్చలముగ నుంచుఁదలఁచిన కొలఁది నా కట్టె యట్టె నీపై బుద్ధి పాఱినట్లే నీకనుగూడ— ఏది!—నీకనుగూడ—నాపై—అలాగే—ఊఁ!—ఊఁ!

దేవ—మీ రనుటకే సందేహపడుచున్నయంశమును నానోట నేల యనిపింతురు ? అదిగో ! కాలిచప్పు డగుచున్నది. శ్రీనివాసుఁడు వచ్చుచున్నట్లున్నాఁడు. విసఱుకఱ్ఱ నద్దుపెట్టుకొనుడు.

(శ్రీనివాసుఁడు ప్రవేశించును)

విప్ర—(తనలో) విసఱుకఱ్ఱ గాదు. వింధ్యపర్వత మడ్డుగ నుండిన నింక వినియోగ మున్నదా ?

శ్రీని—ఈ కోశము కనఁబడుసరికి నాత్రాడు తెగినది.

దేవ—(తనలో) దానిని దాఁచి తద్దినాలమంత్రముల పొత్రను పైని బడవైచితిని.

శ్రీని—దేవదేవీ! నీ వింతసేపటినుండియు నిచ్చటనే యుంటివా?

దేవ—నేను నిచ్చటనే యుంటిని. విసఱుకఱ్ఱయు నిచ్చటనే యున్నది.

శ్రీని—చూడు! నీవు తిరిగి తులసికోట చాటునకుఁ బొమ్ము.

విప్ర—దానికి మాత్రము వినఁబడ వలదా? అది యిచ్చటనే యుండిన మంచి దేమో !

శ్రీని—మొట్టమొదటినుండియు నాలాగుననే యెంచి యింత ముంచుకొంటిమి.

విప్ర—సరే! గ్రంథ మిటు తెమ్ము.

శ్రీని—(ఇచ్చును)

విప్ర—ఏమి యిది?

శ్రీని—ఒకటి యనినమాట యేమి? పూర్వాచార్యరచితము లగు కొన్నిగ్రంథములీ సంచికలో నున్నవి.

విప్ర—ఇందులోఁ గావలసినభాగము నీరాట్టమా? పూచ్చూడలా? తిరుప్పల్లాండా?

శ్రీని—తిరుప్పల్లాండు విశేషభక్తియుక్తముగ నుండు నని నేననుకొందును.

విప్ర—భక్తిలో నన్నియు నొకటే. దేవదేవి కేది కావలయునో?

శ్రీని—నీరాట్టము దాని కక్కఱకువచ్చుట కది సాలిది కాదు; సానిది. మీరు చెప్పిన పూచ్చూడలు పొగచుట్టలైన యెడలఁ గావలయు నేమో? (తనలో) తన బుద్ధిస్థిమితతక్కొఱకు గ్రంథమును జదివించు చుండ దేవదేవి కేది కావలయునో యని యడుగుచున్నాఁడు. రంగరంగరంగా! ఎంత కర్మము!

విప్ర—దేవదేవీ! తిరుప్పల్లాండు నీ కిష్టమేనా?

దేవ—పూర్వమున నది నా కిష్టమే కాని భక్తి కుదిరిన తరువాత దాని వాసనయైన గిట్టకున్నది.

విప్ర—అ దేమి?

శ్రీని—పల్లాం డనఁగ నుల్లిపాయ యనుకొనుచున్నది కాఁబోలు!

విప్ర—ఆలాగా! ఇది లాక్రింద లా.

దేవ—ఉల్లిలోను నంతే కద!

శ్రీని—ఆరంభింతురు!—లేనిపోనిమాట లేల?

విప్ర—శ్లో॥ పల్లాణ్డు పల్లాణ్డు పల్లాయిరత్తాండు
పలకోడినూఱాయిరమ్
మల్లాణ్డ తిణ్డోళ్ మణివణ్ణావున్
శేవడి శెవ్వితిరుక్కాప్పు.

శ్రీని—ఆహా! పెరియాళ్వారు భక్తి మాహాత్మ్యము! ఆహా! ప్రపన్నత! ఆహా! కవితామాధుర్యము!

విప్ర—దేవదేవీ! వినఁబడుచున్నదా?

శ్రీని—వినఁబడక దానిచెవులలోఁ జెట్లు మొలిచె నటయ్యా! మీరు గ్రంథమును దదేకదీక్షగాఁ జదువుదురు!

దేవ—వినఁబడిన లాభ మేమున్నది? నా కేమి తెలిసినదా?

విప్ర—ఓహో! అటులైన లఘువుగఁ దాత్పర్యముఁ జెప్పెదముందువా!

శ్రీని—(తనలో) గురుత్వము గోడగడ్డ యైనది కాదా!

దేవ—మహాభాగ్యము!

శ్రీని—(తనలో) రంగభక్తికి—

విప్ర—(రాగధోరణిగ) పాండ్యమండలమందుఁ దిరువిల్లిబుత్తూరులోఁ దిరుమహావిష్ణు పెరియతిరువడియంశమున జన్మించిన తిరువిష్ణుచిత్తులవారలు లీలావిభూతిలోఁ జేరియుండ నొక్కనాఁడు తమ యిష్టదైవమైన వడపెరంగోయి లుడయాను దమకు స్వప్నమున సాక్షాత్కరించి యీవిధమున సాయించిరి.

దేవ—స్వామీ! పెరియాళ్వారునిగూర్చి సాయించెద మని విష్ణుచిత్తుని గూర్చి సాయించుచున్నా రేమి?

విప్ర—విష్ణుచిత్తుఁడే పెరియాళ్వారు. ఆయనకు భట్టనాథుఁ డని కూడఁ బేరు. ఆ మహానుభావుఁడే శ్రీరంగదేవునికి మామగారు.

దేవ—(తనలో) ఒకభక్తుఁడు విష్ణునకు మామగా నైనప్పుడు మఱి యొకభక్తుఁడు వేశ్యకు మగఁ డేల కాఁగూడదు? క్రమము తప్పినప్పు డొకవిధముగనే యున్నమాట యేమి?

శ్రీని—అయ్యా! సెలవిండు.

విప్ర—ఇదివఱ కెచ్చటకుఁ జెప్పితిని?

శ్రీని—ఇంతలో మఱచిపోయితి రేమి! నడుమ నూరక ప్రశ్నము లుండఁ గూడదు. శ్రీవిష్ణుమూర్తివారు స్వప్నమున—

విప్ర—సరి, సరి! (రాగధోరణిగ) దేవతాంతరమంత్రాంతరసాధనాంతరోపాయాంతరరహితుండును, స్వస్వరూపపరస్వరూపోపాయ

స్వరూపఫలస్వరూపవిరోధిస్వరూపార్థపంచక జ్ఞాననిక్షేపుండును, నాకారత్రయసంపన్నుండును నగు భక్తశిఖామణి కట్లు శ్రీనెంబెరుమాళ్ళువారు సాక్షాత్కరించి "నేను నీ వారాధించు విష్ణుస్వరూపుఁడను. నీతో నొక్కమాట చెప్పవచ్చితిని. ఓభక్తురాలా! —— తలయెత్తి కన్నులు తెఱచి బాగుగా నావంకఁ జూడుము."

శ్రీని—అయ్యయ్యో! అయ్యయ్యో! పెరియాళ్వారుని భక్తురాలా! యని సంబోధించుచుంటి రేమి?

దేవ—శ్రీనివాసా! భక్తులలో లింగభేదము లేదని కాదా మనసిద్ధాంతము!

విప్ర—సరే, పొరఁబాటు! (రాగధోరణిగ) ఓ భక్తశిఖామణీ! ఓ భక్తశిరోవతంసమా! నీవు మధురాపురంబునకు విచ్చేసి పాండ్యభూపాలుం డగు వల్లవదేవరాయనిం గాంచి తద్విద్వత్సభామండపంబునఁ బ్రతివాదిపక్షవిక్షేపణ మొనర్చి, శ్రుత్యంతప్రతిపాదితం బగు పరతత్త్వంబు నిర్ణయించి, స్వమతస్థాపనం బొనర్చి, తత్సభామండలమధ్యస్థరత్నమయతోరణస్తంభస్థలవినిక్షిప్తవిద్యాశుల్కంబు గ్రహించి, తెచ్చికొమ్మని గంభీరఘోషణంబుల నానతీయ, నంత—నా భక్తశిఖామణీ—యావిప్రోత్తంసుఁడు—తద్దేవదేవీముఖారవిందనిష్యందమాన—

శ్రీని—అయ్యయ్యో! "దేవదేవి" కాదు. దేవదేవముఖారవింద. ఇదివఱకుఁ బెరియాళ్వారుకు ఱవికఁ దొడిగించినారు. ఇప్పుడు పురుషోత్తమునకే గాజులు దొడిగించుచున్నారు. అయ్యా! "దేవదేవ"—

దేవ—(తనలో) తలకట్టెగిరినది. గుళ్ళో దీర్ఘము పెట్టినాఁడు.

విప్ర—నడుమ నడుమ నీ విట్లు లడ్డువచ్చుచుండ నే నెట్లు చెప్పఁగలను?

శ్రీని.—నడుమఁ బ్రమాదములు సెప్పుచుండ మనవి చేసికొనవలదా?

విప్ర—ప్రమాదశూన్యముగ నీవు చెప్పరాదా?

శ్రీని—క్షమించుఁడు. మీరే కానిండు. "తద్దేవదేవ"—

విప్ర—అది వలదు. మఱియొకదారిని చెప్పెదను. (రాగధోరణిగఁ) ఆ శ్రీమహావిష్ణుని సంభాషణమును విని భక్తుఁ డిట్లు మనవి చేసికొనెను. అయ్యా! స్వామీ! నేను నిరక్షరకుక్షుఁడను. ఇట్టి మహాకార్యము నావలన నెట్లగునననిన, నీ కేమియు భయము లేదు. నీజిహ్వాగ్రంబున మేము వసింతు మని భక్తవత్సలుఁడు సాయించి పంప, నాతఁడు పాండ్యరాజసభాంతరంబున వైష్ణవ మతస్థాపన మొనర్చి విద్యాశుల్కంబుఁ గైకొని యారాజుచే గంధగజేంద్రం బెక్కింపఁబడి తిరువీథుల వేంచేయింపుచుండఁ గుమారునియున్నతస్థితిఁ గాంచి యుప్పొంగుతండ్రివలె భక్తుని జూచుటకై పరమపదమునుండి శ్రీస్వామివారు లక్ష్మీవక్షస్కులై, శంఖచక్రగదాపాణులై యధిష్ఠితగరుడసంధులై యెదుట సేవ సాయింప—

శ్రీని—స్వామీ! ఇదియే రసమైన పట్టు. ఆ దివ్యమంగళవిగ్రహసౌందర్యమును పెరియాళ్వారెట్లు భావించిరో యట్లే మీరు భావించి యితరచింతల నన్నిఁటిని దిరస్కరించి చిత్తమును గుదుటఁ బఱుచుకొనుఁడు.

విప్ర—సరే! అట్లే భావించెదను. (కన్నులు మూసికొని రాగధోరణిగ) పెరియాళ్వారు వారలఁ గాంచి ఓహో! ఓహో! ఇట్టి దివ్యమంగళవిగ్రహముతో నేల దయచేసితిరి? అయ్యయ్యో! ఈ స్వరూపమునకు దృష్టిదోషము తగులునేమో! (దేవదేవివంక దిరిగి) ఆహా! ఆ కన్నులతీ రేమి? ఆ ముక్కుసొగ సేమి? ఆ కనుబొమల వక్రత యేమి? ఆహా! ఏమి చక్కఁదనము? — ఉబుకుచున్న యా పైఁటలోని—

శ్రీని—(తలపైఁ గొట్టుకొని) అయ్యో! చాలు చాలు! పురాణము నాపిండ కూడువలె నున్నది. పెరియాళ్వారు లేరు, పెరుమాళ్ళు లేరు. అయ్యయ్యో! దేవదేవిని వర్ణించుచున్నా రేమి?

విప్ర—చిత్తము స్వవశము కాకుండ నున్నది.

శ్రీని—ఒకప్పుడైన, సలవాటుచొప్పుననైన నిప్పుడు "రంగరంగా" యనుట మానినైె చినా రేమి?

విప్ర—చిటపట లాడుచున్నది. అది యేమి? చినుకు పడుచున్నదా?

శ్రీని—గాఢముగ మబ్బుపట్టినది. పెద్దవర్షమే వచ్చు నేమో?

దేవ—గాలివాన వచ్చుటచేతఁ గాలక్షేప మిఁకఁ గట్టివేయవచ్చును. బట్ట లారనైచితిని. తడిసిపోవు నేమో విప్పి జాగ్రత్తపెట్టెదను.

విప్ర—పోయి శీఘ్రముగ రమ్ము. తడిసిపోవును వేమో సుమా!

(దేవదేవి పోవును)

శ్రీని—(విప్రనారాయణుని కాళులు పట్టుకొని) స్వామీ! పడిపోవుచున్నారు. భక్తిని నిలుపుకొనరా? అయ్యయ్యో! దేవదేవిముండ మిమ్ములఁ బాడుచేయుచున్నది. మీయానెల వగునెడల దానినిఁ జెప్పునఁ గొట్టి యీడ్చివైతును. లేదా మన మెక్కడకైనఁ బోవుదము రండు.

విప్ర—నామూలమున దానికిఁ గూడ భక్తి జాఱుచున్న దఁట! నేను భ్రష్టుఁడనైనను నాకు నీవు దోడుందువు. కాని పాపము! అది భ్రష్టత నొందిన దాని కింక దిక్కెవ్వరు? మనల నింత కాలమునుండి కనిపెట్టుకొనియున్న దానినే మనము నిరాకరించుట న్యాయమా?

శ్రీని—అది యిప్పుడు భ్రష్టురా లగుట యేమి? పుట్టినప్పుడే యైనది. వంశానుక్రమముగ నైనది. అది మీకొంపఁ గూల్చుట కిక్కడకుఁ జేరినది. అయ్యయ్యో! రక్షించుకొనుఁడు.

విప్ర—నన్నుఁ బాడుసేయుటకు దానియుద్దేశ మేమి? వారకాంతకుఁ గావలసినది ధనముకద! అది నాయొద్ద లేదుకద! స్వరూప లావణ్య మంతకంటె లేదు కదా! ఏమి మూటగట్టుకొనవలయు నని యది నన్నుఁ బాడుసేయ నున్నదో చెప్పు.

శ్రీని—పాపము. మహాపాపము!

విప్ర—ఐహికఫలవాంఛాలేశమైన లేకుండ బుద్ధిపూర్వకముగఁ బాపము మూట గట్టుకొనుట ప్రాణికోటికి సహజమా ?

శ్రీని—నేను మీ కుత్తర మీయఁజాలక యున్నాను. కాని దానిచే మీరు పాడగుట నిశ్చయము.

విప్ర—అకారణముగఁ బాడుకావలసివచ్చినప్పుడు — ఈ జన్మమునఁ గనఁబడనికారణముచేఁ బాడుకావలసినప్పుడు — అనఁగఁ బూర్వ జన్మప్రారబ్ధకారణమే భ్రష్టత కీడ్వవలసినప్పుడు — ఎవఁ డేమి చేయఁగలఁడు ? ఏ మగునో, కానీ!

శ్రీని—ఏ మగుట కే మున్నది ? ఇఁక వేశ్యావీథిని నెత్తిమొగము వేసి కొని మీరు విటాధములు కానై యున్నారు.

విప్ర—ప్రారబ్ధ మటు లుండఁ దప్పునా ?

శ్రీని—మనమతముల కన్నిఁటికిఁ బూర్వజన్మప్రారబ్ధ మను నీదిక్కుమాలినయంశ మొకటి దాపురించి యందఱిని భ్రష్టులఁజేయుటయే కాక, తిరిగి బాగుపడకుండ భ్రష్టతలోనే యొకసంతుష్టిని గలుగఁ జేయుచున్నది.

సీ॥ ద్యూతంబునను నోఁచి ♦ పాతరాయం డయి
ప్రారబ్ధమున నిట్టు ♦ లైతి ననును
కలుద్రావుమత్తునఁ ♦ గొంతగొంతుకఁ గోసి
ప్రారబ్ధమున నుఱి ♦ వచ్చె ననును
ప్రబలదురాశఁ జౌ ♦ ర్యం బాచరించుచుఁ
గారలోఁ బడఁ బూర్వ ♦ కర్మ మనును
వ్యభిచారమున నోడ ♦ లంత పుచ్చినఁ బురా
కృతకర్మమునకు న ♦ డ్డేది ? యనును
ఇట్లు మగనాలిఁ జెఱిపితి ♦ వేల యనిన
నిది వెనుకజన్మమున నన్ను ♦ నిట్లొనర్చెఁ

పూర్వకృతఫలం బిది కాని ♦ బుద్ధికృతము
గా దనును — బుద్ధి లేకుంట ♦ కల్ల గాదు.

సీ॥ చదువు లేకుండ న♦జ్ఞత నుంటివే లన్న
యోగ ముండిన నన్ని ♦ బాగుపడును
ముసలిపందకుఁ గూఁతు ♦ నొసఁగుట తగదన్న
దళ మున్న నైదువ♦తనము నిలుచు
వ్యాధికి వైద్యంబు ♦ వలదందువే లన్న
నాయువే తగ మందు ♦ లబ్ధుపడునె
దైవముం దలఁపుము ♦ తగ దన్నఁ బుణ్యా ప్తా
గతి యున్న సద్బుద్ధి ♦ కలుగు నను
జనుఁడు; దైవ మొసంగిన ♦ స్వల్పబుద్ధి
నైన వినియోగమును జేయు ♦ కకట ! సౌఖ్య
మందలేక యీయఁగలేక ♦ వ్యర్థుఁ డగుచు
నన్నిఁటికి నెత్తిగీతనే ♦ యెన్నుచుండు.

స్వామీ! ఏమో పరాకుగా నున్నా రేమి?

విప్ర—నీ వేమంటివో వినుటకు నా కిప్పుడు తగినంత చిత్తశాంతి లేదు. చూడు! ఈవర్షమెందుచేతనో కాని నాకు మనోవికారమును వృద్ధిచేయుచున్నది సుమా!

శ్రీని—ఆలాగా ! మీ మనసునుండి భక్తి నశించినది. శృంగారరస మంకురించినది.

గీ॥ వర్షపాతము స్త్రీవాంఛ ♦ ప్రబలఁ జేసి
తుదకు విరహుని స్త్రీపరిక్ర ♦ నదుకుపెట్టు;
నెట్టినీటిప్రవాహంబు ♦ వెట్టికుక్క
విసము వెలిపుచ్చి మృతిప్రక్కఁ ♦ బెట్టు నరుని.

(నేపథ్యమున) ఉరుములు మెఱుపులు.

విప్ర—శ్రీనివాసా! నీ కొకమాట చెప్పెదను విందువా?

శ్రీని—హితమును నిరాకరించుటకు నా కేమివికారము సంభవించినది?

విప్ర—ఇఁక నట్టి ప్రశంస వలదు. ఉరుములు మనకే భయంకరములుగ నున్నవి. పాపము! మనబట్టలు తడిసిపోవు నేమో యని పరుగెత్తిన దేవదేవి యింక రాకున్నది. తడిసిపోయినదో! గాలిచే నెక్కడ నైనఁ బడిపోయినదో! నీవు పోయి యామెను దీసికొని రమ్ము.

శ్రీని—దానిని వదలుకొనవయ్యా యని నేను దేవులాడఁగ దానిని దీసికొనివచ్చి నాయెదుటఁ బెట్టుమని మీరాడ న్యాయమా?

విప్ర—దానిని గాఢాంధకారమున నశనిపాతభయంకర మగు నిట్టి వర్షమున నొక్కతెను నిరాచ్ఛాదనస్థితిని ద్యజించుటమాత్రము న్యాయముగ నున్నదా!

శ్రీని—అది తడుపనే తడిసినది. నన్నుఁగూడ నేల తడిపెదరు?

విప్ర—పురుషుఁడవు, దానికంటె నెక్కువ వస్త్రములు గలవాఁడవు. నీ కేమి? పొమ్ము. ఇఁక నాలస్యము చేయకుము.

శ్రీని—అటులైనఁ బోయెదను. అయ్యా! నమస్కారము. ఇఁక మి మ్మాఁపుట బ్రహ్మతరము గాదు. (పోవును)

విప్ర—ఇంక రాలేదు. చెట్లకొమ్మ లేమైన విఱిగి మీఁదఁ బడినవో? దారిగానఁబడక నేదైనఁ గాలికిఁ దగిలి పడెనో?

(నేపథ్యమున) హాహాహా! చలి, చలి, చలి! హాహాహా!

విప్ర—అదిగో! అదిగో! దేవదేవీ! తడిసిపోయితివా?

(నేపథ్యమున) చలి, చలి, చలి! హాహాహా!

విప్ర—ఆహా! దైవకటాక్షమున నిప్పుడే మెఱుపు మెఱయుటచేఁ గనులును, దత్కాంతివలన నార్ద్రవస్త్రధారిణి యగు నామెదర్శనమున హృదయము నొక్కమాఱు తళుక్కు మని పోయినవి. చలిచేత బాధపడుట యేల? ఇదిగో! నాయుత్తరీయమును జుట్టఁబెట్టుకొనుము. (అటు పాఱవైచి తనలో) పాపము! చలిచే

నెంత బాధ పడుచున్నదో! (ప్రకాశముగ) కట్టుకొను చున్నావా?
(నేపథ్యమున) ఆ!

దేవ—(ప్రవేశించి) చలిచలిచలి! (వడఁకుచు దగ్గఱకు వచ్చును)

విప్ర—సందేహింపకు, సందేహింపకు. దగ్గఱకు రమ్ము. మనుష్యుని వేఁడిమి మంచిది.

దేవ—హాహాహా! (కౌఁగిలించుకొనును)

విప్ర—హాహాహా! ఏమి యానందముగ నున్నది! హాహాహా!

దేవ—మన మా ప్రక్కనుండు గదిలోనికిఁ బోవుదము. శ్రీనివాసుఁడు వచ్చు నేమో?

విప్ర—శ్రీనివాసుఁడు నీకుఁ గానఁబడ లేదా?

దేవ—నా కాతఁడు కానఁబడినాఁడు. కాని నే నాతనికిఁ గనఁబడకుండ వచ్చితిని.

విప్ర—సరే, రమ్ము.

దేవ—(తనలో) విష్ణుదాసుఁ డిప్పటికి వేశ్యాదాసుఁ డైనాఁడు. ముకు త్రాడు వేసి యితని నీక మాగ్రామములోని వేశ్యావీథి కీడ్చుకొని పోవుటయే తరువాయి—

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

ఇది చతుర్థాంకము.



శ్రీ

# విప్రనారాయణ చరిత్రము

## పంచమాంకము.

ప్రదేశము— "తిరుక్కరంబనూరు" అనుగ్రామమున వేశ్యావీథి.

(ప్రవేశము—శ్రీనివాసుఁడు, విప్రనారాయణుఁడు.)

విప్ర—దానియిల్లింక నెంతదూర మున్నదో చూడు! ఆమలు పేదై యుండునో?

శ్రీని—అదియే నండి! వేశ్యావీథికిఁ దొడ్లక్కము.

విప్ర—పవిత్రములగు వైష్ణవనామముల నేల యపరిశుద్ధ చేసెదవు?

శ్రీని—పవిత్రతము లగు వైష్ణవులు భ్రష్టులై పోవునప్పుడు మాటల లెక్క యేమి?

విప్ర—అట్లు కాదు. భాగవతోత్తములు శాశ్వతులు కారు. ఎందఱు పుట్టిరో! ఎందఱు భ్రష్టులైరో, ఎందఱు నశించిరో! కాని వైష్ణవసాంప్రదాయవాక్యములుమాత్రము శాశ్వతములు.

శ్రీని—వాక్యములకంటెఁ జేష్టలు శాశ్వతములు కావా? మొగము కానఁబడకుండ మేలుముసుఁగు వైచికొని సందెచీఁకటిని వేశ్యయింటికిఁ బోవు మిమ్మెవరు చూతు రని యనుకొనుచున్నారేమో! ఎవఁడో యొక పనిలేని చలపాదికవి ద్వాదశోర్ధ్వపుండ్రధారు లైన మిమ్ము, దర్భాసనధారుఁడ నైన నన్ను మన మిప్పు డిక్కడ నున్నట్లువలెనే వేశ్యావీథిరంగమున వెఱ్ఱిమొగములతోఁ బ్రవేశింపఁజేసి, యెదుటఁ గూరుచుండు సామాజికులచేత "ఛీఛీ!" యని పించి, వెకవెక వెడనవ్వుల నవ్వించి "థూథూ" యని మీఁద

నుమియఁజేయు కుండునెడల నేను బ్రాహ్మణజన్మమునఁ బుట్టని వాఁడ నని ప్రమాణము చేయఁగలను. లోకప్రఖ్యాతమై యా చంద్రతారకముఁగ నిలువవలసిన యీ మీచేష్ట మాపటిమత్తులో మాసిపోవు ననుకొంటిరా ? సూర్యునివలె దివ్యతేజమునఁ బ్రకాశించి యవతలి ప్రపంచార్ధమునందుఁగూడ వ్యాపించును గాని—ఆహా ! అట్టిపనిని జేసినారు మహాత్మా ! చాలుచాలు ! ప్రపంచ మున్నంతకాలము భక్తలోకమునకు మీచేష్టవలనఁ గలిగిన తలవంపు చాలు ! చాలు ! నాకు మిమ్ముఁ జూడ నేడుపు వచ్చుచున్నది. ఆహా ! ఎట్టి మహోన్నతస్థితినుండి యెట్టియధో గతికిఁ గ్రుంకిపోయినారు ! ఆహా ! ఆకాశమునుండి చుక్క యూడి పడినట్లయ్యెనే ! ఇఁక నొక్కమాట కడపటిసారి చెప్పుచున్నాను. నేను మి మ్మిట్టిస్థితిలోఁ జూడలేక— నామన సుండఁబట్టలేక— వెట్టిచేఁ జెప్పుచున్నాను. ఇదివఱకుఁ దిగ్వారాధనపుగదిలో నేమి జరిగినదో జరిగినది. దానినిగూర్చి లెంపలువైచికొనియో, తల నేలను మోదుకొనియో, కావేరిలోఁ బడి మృత్తికా స్నానములేడ్చియో యెట్లో యొకట్లు చూచుకొందము. ఇఁక నొక్క యడుగైన ముందుఁ బెట్టక వెనుకకు రండు, పోదము.

విప్ర—నీకు నాయందుఁ గల ప్రీతికి సంతసించితిని.

గీ॥ భక్తిరక్తులు వేఱుత ♦ త్త్వములు కావు;
భక్తి దైవానురాగము, ♦ వనితపైని
రాగమగు రక్తి; యది యిది ♦ రాగ మొకటె;
తత్ప్రవాహాదిగతులె భే♦దములు సుమ్ము!

గీ॥ భక్తి యెమురెత్తుగాన నిం♦పాదినడక,
రక్తి పల్లపువాల్గానఁ ♦ బ్రబలవేగ
యుతము, మార్పడిచేత నా ♦ సతతభక్తి
మఱలి తలక్రిందుగా నట్టె ♦ దొరలు నిపుడు.

గీ॥ కాలభేద జగతిభేద ♦ లీల కెదిరి
డీకొనుట యానె ? మంచిది ♦ మేకొనుటయె;

గాలివానకు నెదురెక్క • గడఁగకుండ
నావికుఁడు దానిగతిఁ బట్టి • పోవుఁగాదె!

గీ॥ అడఁచిపెట్టిన రక్తి హే • త్వంతరమున
వెలిఁబడినయప్డు భీకర • చలన మొందు
నట్టి బిగువుగ దట్టించి • నట్టిమందు
రంజకం బంటి ఢామ్మని • ప్రబలునట్లు.

గీ॥ లో నడంచిన రస మొక్క • లోపమునను
బైబడినయప్డు ప్రబలదు • ర్భరతఁ బొంగు,
నావిరిని సింధుపాత్రకు • నంతదారి
నీయ బుస్సను ధ్వనితోడ • నెగసినట్లు.

గీ॥ అడఁపఁబడుచు హఠాత్తుగా • నతిశయిల్లు
నట్టి రక్తికి దయ్యంబు • పట్టినట్టి
మనుజునకుఁ గల్గు నంత సా • మర్థ్య మందు,
పిచ్చివానికిఁ గలయంత • వేగ మమరు.

గీ॥ అస్వభావశక్తిని స్వభా • వాల్పశక్తి
తో నెదుర్కొనఁ దరమానె? • శ్రీనివాస!
చచ్చుపాపటగొట్టాన • వచ్చునట్టి
చిన్నకాయకు ప్రేలుడు • సేయఁగలమె?

గీ॥ కానఁ బ్రస్తుతావస్థార్థ • మైన పనిని
జూడఁదగుఁగాని యెదురింపఁ • గూడ దయ్య!
ఇద్ది మార్వాడి యని యంటి • నిద్ది యెంతొ
వలకు నుండదు వడిలోనఁ • బడుదుఁ దిరిగి.

శ్రీని—అందుచే దైవభక్తుల రగు మీరు దాసిదానియింటికి దానిదర్శనము నిమిత్తమె దయచేయుటయే తారకమార్గ మని కాదా యభిప్రాయము?

విప్ర—అభిప్రాయమే కాదు. ఆచరణముకూడ నటులే.

శ్రీని—సరే. అట్లయిన దయచేయుఁడు ఇక్కడనుండియే వేశ్యలకొంప లారంభ మని చెప్పితిని గాదా! తన యింటిగుర్తులఁ గూర్చి యాది మీకుఁ జెప్పినమాటలు జ్ఞప్తియున్నవా?

విప్ర—బాగుగ నున్నది. అదిగాక యెంతయో మనస్సంభ్రమముతో సది నాకొఱకు గుమ్మములోఁ గనిపెట్టుకొని యుండదా! ఎప్పుడు వత్తునో, యెప్పుడు వత్తునో యని యెదురుచూచుచు నేమియుఁ దోఁచక మహాందోళనమున నుండదా? దానికిఁ గూడ నాయట్టియవస్థయే సిద్ధించినది. కాన దానికిఁగూడ నాపై ననురాగము ప్రబలముగ నుండును. తాను వచ్చి నన్నుఁ దనయింటికిఁ దీసికొని వెళ్ళెద నని చెప్పినదే! ఏమి తొందరచేత రాలేదో? దానిని జూచువఱకు నామనసు శాంతిగ నుండదు.

శ్రీని—సరే, రండు. సమీపించుచున్నాముగదా!

(నేపథ్యమున) అడియేన్ దాసోహం! అడియేన్ దాసోహం!

విప్ర—దాసోస్మి! దాసోస్మి! దాసానుదాసోస్మి!

శ్రీని—ఈ సమయమున మీరు ప్రత్యుత్తరము లనఁగూడదు. (తనలో) ఇప్పుడు నమస్కరించిన ముండకొడుకు పిల్లివలెఁ జీఁకటిలోఁ గూడఁ జూడఁగలడు గాఁబోలు!

విప్ర—ఎందుచేత?

శ్రీని—మీరు సందెచీఁకటిని ముసుఁగువైచికొని పోవుచు మాటలాడుదురా?

విప్ర—సందెచీఁకటి తనయంతటఁ దాఁ బడెనుగావున వచ్చితిని. నీవు ముసుఁగువైచితివి కావున నే నొప్పుకొంటిని గాని నా కేమి భయమా? నా కున్నదోషము దేవదేవీవాంఛ. అంతే కాని నాకుఁ బిఱికితన మేమి? అదిగాక యాచార్యుఁడు నమస్కరింపఁ బ్రతినమస్కారము సేయకుండుట తప్పుగాదా!

శ్రీని—అతఁ డాచార్యుఁడఁటయ్యా? జారుఁడు! పరిహాసమునకు నమస్కరించుచున్నాఁ డని తెలియవలదా?

